

## కృతిపతి

కీ॥ శే॥ శ్రీ దుగ్గిరాల వెంకటసూర్యప్రకాశరావుపంతులు.

# కృతిపతిప్రశంస

పరమ మేధావులై వరమహామంత్రులై
చాలినవా ర్దుగ్గిరాలవారు
రాజకీయనిరంతరాయసాధకతా సు
శీలు రెన్నగ దుగ్గిరాలవారు
సంఘసంస్కారవిస్తర దివ్యధీగుణ
శాలు వాదురు దుగ్గిరాలవారు
భాషామహాప్రియంభావుకసత్కవి
త్వాలవాలులు దుగ్గిరాలవారు

కొంద ఱెస్టేటుదారులు కొందఱందు
న్నతోద్యోగు లొక కొంద ఱుచితదాన
సక్తులై లోకసేవాప్రశస్తి గాంచి
రహి వహించినారీ దుగ్గిరాలవారు.

దుగ్గిరాలాన్వవాయ పాథోధియందు
రెండు రతనాలు పుట్టె, నా రెంటిలోన
నొక్కటి ప్రకాశవంతమై మిక్కుటమగు
యశముగాంచె ప్రకాశరాయాహ్వతోడ.

స్వార్థమే లేని గుప్తార్థదాన మొసర్చి
చుట్టాలసురభియై పుట్టె నెవఁడు
పరమభాషాసేవ భవ్యప్రజాసేవ
యే లక్ష్యముగఁ గొన్నహితుఁ డెవండు
తన పెన్నను ననాథతతికి విద్యార్థి వే
తనముల కిచ్చిన దాత యెవఁడు
సంఘసంస్కార విస్తరతకుఁ దనదు భీ
మాధనం బొసఁగిన మాన్యుఁ డెవఁడు

నీటిపార్దలశాఖతో నిరతిఁ బోరి
సర్వసౌకర్యములను కర్షకుల కెలమి
కలుగఁజేసిన యా మహాఘనుఁడు దుగ్గి
రాల కులవర్థనప్రకాశరాయఁ డెగద.

కృష్ణకు గోదావరీమహానది కాన
కట్ట లోహాయనఁ గట్టినట్టి
కాటన్ మహాశయు ఘనశిలావిగ్రహ
స్థాపన ప్రోత్సాహ సవ్యసాచి
రహిఁ గృత్తివెంటిపేరాజు హైస్కూలుకు
వసతి నొసంగిన యసదృశుండు
పైండాసుచలపతిభాండగారము కాను
హాలులో స్థాపించినట్టి సుకృతి

ఎంతయధికారి యగుఁగాక యే మహాసు
సంస్థ యగుగాక యే దురాచరణ మొకడు
జరిపెనేనియు దాను కేసరి విధాన
చీల్చి చెండాడుపావనశీలుఁ డితఁడు.

శాసనలిపుల నిచ్చలునేర్చి పరిశోధ
నలు సల్పియున్నవిజ్ఞానఖని
ఉపనిషత్తులను నెంతో శ్రద్ధతోడుత
ఆంధ్రీకరింపించినట్టి దిట్ట
తాళపత్రగ్రంథ తతిని సంపాదించి
పరిషత్తులకు నిడ్డ భవ్యమూర్తి
జాతీయసభలలో సభ్యు లానందింప
భాషింప నేర్చినపండితుండు

వత్సలత్వము ప్రేమ మవ్వారిగాఁగ
ననుజు పైఁజూపి గౌరవించిన ఘనుండు
పరులతోనైన నవ్వుచుఁ బలుకువాఁడు
అతని కెనలే రనగవచ్చు నవనిలోన.

అందంబుగా నుపాధ్యాయవృత్తి నెలార్చి
విద్యార్థులకుఁ గల్పవృక్షమనఁగ
మహిత గోదావరీమండలకార్యద
ర్శిగనుండి కీర్తి నార్జించుకొనియె

సహాకారబ్యాంకులఁ స్థాపించి కోశాధి
కారిగానుండి తా పేరుమోసె
పురపారిశుధ్యసంస్కరణలు నడిపించి
'వైస్ చైర్మనుగను' నిర్వహణసలిపె

తా 'కలెక్టరాఫీసులో' ధర్మవృత్తి
తనరి 'హెడ్డకౌంటెంటుగా' పని యొనర్చె
ఇన్ని పదవులఁ దా నందియున్నఁగాని
తప్పలే దావగింజంత ధర్మపథము.

అల పిఠాపురపాలకుల కళాశాల సం
ఘమున సభ్యుఁడుగ విఖ్యాతినందె
మెచ్చ జిల్లాబోర్డు మెంబరై తాను చె
ప్పినది వేదముగ మెప్పించికొనియె

తనదు తాలూకాకు తగ ప్రెసిడెంటయి
పాలించి యెన్నొ దీపముల నిలిపె
అడ్వైజరై జనరలాస్పత్రి కెన్నన్నొ
కడఁగి చేయించె సౌకర్యములను

కందుకూరి వీరేశలింగ కవివర్య
ఛాత్రిత భజించి సంఘసంస్కర్త యగుచు
రమ్య రఘుపతి వేంకట రత్నవరుని
మైత్రితో సంఘసేవ నేమరక సలిపె.

పాపప్రవృత్తిలే దొరల బాధలుచూచి సహింపనేరఁ డే
కోపములేని నిర్మలుఁ డకుంఠితదీక్ష గలట్టివాఁడు సం
తాప మెఱుంగఁ డాతఁడు ముదంబున పాడినదెల్ల పాటగా
పాప్రిపు గడించినాఁడు పరభాగుఁ డనంగ ప్రికాశరాయఁడే.

భవ్యుఁడైన బిషిప్ చంద్రిపాలహూళి
ధన్య శివనాథశాస్త్రి, సీతానసాథ
తత్త్వభూషణవరుల మిత్రిత గణించి
తెలిసె నా మహాత్ముల మహోద్దేశములను.

సదయుఁడు మెక్లారిన్ దొర
మొదలుగ పాశ్చాత్యవరుల ముదలనడిపి పెం
పొదవఁగ క్రైస్తవజాతికి
సదనులఁ దలలోనినాల్కయై పర్తిల్లెన్.

అల్ల పెద్దకలెక్టర్ల కారితేరి
సట్టి తహసీలుదార్లకు నతులరాజ
కీయముల సలహాలఁ దానీయగలిగి
ఆంధ్రిచాణక్యుఁ డనుపేరు నందె నితఁడు.

ముప్పదియేండ్లక్రిందట నపూర్వదయానిధియై ననుం గనుల్
కప్పినవాఁడు నాపయి నఖండితగౌరవ ముంచినాఁడు నే
నెప్పటికప్పు డా పురుషునే యనుకొంచు ముదబ్ధిలోపలన్
తెప్పలఁదేలినా నభిమతిన్ గొనినాను మదీప్సితంబులన్.

ఎనుబదియేండ్లుదాటి జని నెంతయు ధన్యమొనర్చినాఁడు పా
వనగుణభాసియై పరమభాగ్యము లందినవాఁ డనంత వృ
ద్ధిని మన కాకినాడపురిఁ దీరిచి దిద్దినవాఁ డకించనా
వనపరిపాటిమై మెలఁగినాఁ డతఁడొక్క-ప్రకాశరాయఁడై.

పురుషు నీతని నాదర్శముగ నిడుకొని
అట్లనుకరింపఁగలరను నాశయమున
ఈ యుదారుని గుణగణమెల్లఁ దడవి
సొరిది చూచాయగా నిటఁ జూపినాఁడ.

మనుజుఁడై పుట్టి యాయుఃపరిమాణ మంది
పుత్రపౌత్రప్రపౌత్రులఁ బొంది, సర్వ
మాన్యుఁడై యిహపరసౌఖ్యమహితుఁడైన
ఆ ప్రకాశరాయని మదియందుఁ దలఁచి.

స్మృతిచిహ్నముగా నే నీ
కృతి యాకృతి కొనఁగుచుంటి; కృతకృత్యతకున్
గతు లీకృతులే చిరసు
స్థితికిన్ భూలోకమునఁ బ్రసిద్ధి వహింపన్.

ఓమితి శివమ్.

గ్రంథకర్త.

# అహల్యా - కథాసంగ్రహము

## (జననాది)

ధర్మసంస్థాపనమొనరించుటకై వాణియు, బ్రహ్మయు భూలోకమున మునిదంపతులుగ జన్మించిరి. వారికి శ్వేచ, అహల్య యను నిరువురు పుత్రికలు జనించిరి. అందహల్యను గౌతమమహర్షి పెండ్లాడెను. ఈ దంపతుల గార్హస్థ్యము పరస్పరానురాగరంజితమై యొప్పెను. కొంతకాలమునకు వారి గర్భమున నొక కుమారుఁడు గలిగెను. పుట్టువుతోడనే నూఱునవ్వులు నవ్వుటచే నాతనికి "శతానందుఁ"డని పేరిడిరి. అతఁడు పెరిగి పెద్దవాఁడై తండ్రివలెనే తపస్సంపన్నుఁడయ్యెను. సర్వశాస్త్రముల నేర్చెను.

దండకయందలి యిరువది గ్రామములకు ప్రభువై, పండితుఁడై, పరిపాలకుఁడైన ప్రకాశవహుఁ డనువానికి లేకలేక యొక కొమరిత కలిగెను. ఆమె పేరు "జనతి". తండ్రి యామెకు చక్కని శాస్త్రజ్ఞానము కళానైపుణ్యముగలిగించి గృహకృత్యములనునేర్పి యామె కీడువచ్చుటతోడనే గౌతమపుత్రుఁడు శతానందునకిచ్చి పెండ్లిచేసి యత్తవారింటికంపెను. ఈ దంపతులు కొంతకాలము అన్యోన్యముగ గడపిరి. పిదప శతానందుఁడు వేదాంతవిద్యఁ దెలియ ధర్మారామమునకు దాల్భ్యుఁ డను మునిని సేవింప నరిగెను.

## వరదానము

ఒకప్పు డహల్యా గౌతములు ఆనందముగ భాషించుకొనుచు "అహల్యా! పురుషుఁడు జితేంద్రియుఁడై తత్త్వసంధాన మొనర్చుకొని

ధన్యుఁడగుటకు సత్ప్రవృత్తియే కారణము. నీ చూపువలన నేనట్టి ధన్యుఁడనైతిని. నీవలన నేను పూర్ణసంతృప్తి నందితిని. కాన నీకొక వరమీయఁదలఁచితిని. కోరుకొమ్మ నెను.

మహాత్మా! నాకు వరములేల ? తామే నా వరప్రసాదము. భార్య భర్తయొక్క పుణ్యమును బంచుకొనుచు పతిసేవల నేమఱుట ధర్మమా? నేనును అట్టిదే యాచరించి నాజనిని సఫలమొనర్చుకొనుచున్నాను. ఈపాటికి పొగడ్తలు, వరదానము లనవసర మన్నది.

గౌతముఁ డామె పలుకులకు సంతసించి 'నీవు కోరకున్నను నే నావరము నా సంతృప్తికై యిడుదును. నీవు లోకక్షేమ మెంచి ప్రవర్తించిన కార్యమందు తప్పక విజయము కాంచెదవు. దీనిని గ్రహింపు' మనెను. అహల్యయు నమస్కారపూర్వకముగ పతి యనుగ్రహమును గ్రహించెను. గౌతముఁడు తన శిష్యులకు విద్యలు నేర్ప నటనుండి వెడలిపోయెను

## విజయము

దండకారణ్యమందొక మూల గ్లేచ్ఛమండలము గలదు. అచటి వారు పండితులేయైనను మాంసభోజనాదికమే స్వీకరించి వేదాదులను నేర్చుచు ఉద్దవ్యజాతికి చెందిన బ్రాహ్మణులై వేట, వ్యవసాయము, పౌరోహిత్యములు చేసికొనుచు జీవించుచుండిరి. వారు గౌతమునికడ వేదవిద్య నేర్చుచుండిరి. వారు 'జనస్థానము' అను నగరముమీఁదుగా దినదినము గౌతమాశ్రమమునకు పోవుచుందురు.

తన నగరముమీఁదుగా వారి రాకపోకలు సహింపక తన్నగర భర్త ప్రకాశవహుఁడు 'మీరవాచ్యులు, సంస్కారరహితులు, మాంస

భక్తులు, మా గ్రామముమీదుగా మీరు పోరా"దని వారి నడ్డగించెవాడు. ఈవిధముగా వారిలో వారికి కలహములు పెరుగుటచే ఉద్గవ్యులు గౌతమాశ్రమమునకు రాలేకుండిరి. వారి చదువున కాతంకము కలిగెను.

ఒకనాఁ డహల్య శిష్యులు రాకుండుటనుగూర్చి గౌతమర్షి నడిగెను. గౌతముఁడు జరుగుచున్నది శిష్యులొకటిరెండుమారులు తనతోఁ జెప్పియుండుటచే నా సంగతి యహల్యకుఁ జెప్పెను. అప్పు డహల్య శిష్యుల కావిఘ్నము లేకుండఁ జేయరాదా యనెను. కావలసిన వారితో విరోధములు మనకేల యని గౌతముఁ డనెను. అహల్య యీ మాట కంగీకరింపక నేను మన వియ్యంకునికి దూతనంపి మా శిష్యవర్గము నడ్డవద్దని చెప్పించెదను. వినెనా సరి. లేనిచో ఉద్గవ్యుల సాయమున నాతని జయించి ధర్మమును నిలుపుదును. దీనికి తామిచ్చిన వరబలముకూడ నున్నదికదా యనెను. గౌతముఁ డందులకు నీయిష్ట మనెను. పిదప దూతకార్యము నడచినను ప్రకాశ్రవహుఁడు తన తప్పు దిద్దుకొనలేదు. అహల్యయు నాతనిని యుద్ధమున నోడించి, వెడలఁగొట్టి యీ దేశ ముద్గవ్యుల కిచ్చివేసెను. దానితో విద్యార్థుల రాకపోకలు నిరంతరాయము లయ్యెను.

## ఉపదేశము

ప్రకాశవహదంపతులు రాజ్యభ్రష్టులై యడవులపాలైరి. అప్పుడు వారికడకు ఒకనాఁడు నారదుఁడుపోఁగా వారాతనితోఁ దమవృత్తాంతము వెళ్ళబోసికొని విచారించిరి. అతఁడు ఎవరికర్మఫలము వారిచేతనే యనుభవింపఁజేయనవతరించిన వాఁడనగుటచే "రాజా విచారమేల? యని

సాధించుకొనుటకు వేయిదారులున్న వనును. ప్రికాప్రివహుఁడాతని నను నయించి స్వారాజ్యప్రాప్తికై, అహల్యను వంచించుటకేదేనొక దారి చూపుమనును. నారదుఁడా యుపాయమును దత్పద్ధతియు నాతనికి రహస్యముగఁ జెప్పి పోవును. వెంటనే ప్రికాప్రివహదంపతులు ముని దంపతులవలెమారి గౌతమాశ్రమప్రాంతముల నొకకుటీరమును వేసి కొనియుండి యహల్యను వంచించుటకై సమయము చూచుచుండిరి.

## ఉపక్షేపము

ఒకనాఁటిరాత్రి కోడికూయఁగనే గౌతముఁడు స్నానమునకుబోవ లేచి యహల్యను లేపి నాయంగవస్త్రమును జపమాలను, జలకుండికయు నిమ్మనియడిగెను. దాని కహల్య అయ్యా! ఈదినమున వర్షమధికముగా గురియుచున్నది. ఈ చీకటిలో, వానలో నదికిఁబోనేల? ఇంటియొద్దనే మీకర్మకలాపము తీర్చుకొనరాదా యన్నది. స్నానమునకు బోవు వానిని వానయేమిచేయునే వెఱ్ఱిదానాయని తనపరికరములతో నతఁడు నదికి పోవుచుండ వర్షమధికమయ్యెను. అప్పు డాతఁ డాదారిలోనున్న పర్ణశాల పంచకుఁజేరి నిలువఁబడి వర్షముతగ్గుటను కాంక్షించుచుండ, నాలోపలనున్న దంపతుల సంభాషణము ఈక్రిందివిధముగ వినిపించెను.

"ఓసీ నీవు అహల్యకడకేగి ధర్మములను గ్రహించుచు నిత్యము నామెను సేవించుచున్నావా?

"ఆ. వెళ్లుచుంటినిగాని ఈనడుమ తామింటలేరు. నేను అహల్యను జూడనేఁగితిని. ఆమె యింద్రునితో నేకశయ్యపై నుండుట గాంచి ఛీ యనిపించి యిక నటబోవ మానితిని.

"ఐతే గౌతముని బుట్టలో పెట్టినదన్నమాటే. మాటలు అట్లును క్రియలిట్టులునా? 'భార్యా రూపవతీ శత్రుః' అని మన పూర్వులూరకే యన్నారా ?"

"ఆర్యా అంతలో తీరలేదు. ఆమె యింద్రుని కౌఁగిటనుండి నా కర్మముకొలది నా కామగఁడు లభించెను. సర్వదా వ్రతము లుపవాసములు, జపములు తప్ప యాయనకు వేఱుగొడవలు లేవు అన్నది. ఇవి గౌతముఁడు విన్నచో నెంత బాధపడునో? ఇంద్రుఁడుగూడ నీయంద చందముల కాపతి తగడు. నావీటికిరమ్ము, నిన్నిందభోగముల నోలలార్చెద ననెను.

ఈమాటలు రెండుమూడుతూఁకులు గౌతముడు విని మొదట తన్ను గాదని తలఁచి, తన వ్రతోపవాస బ్రహ్మచర్యముల గొడవ బైటఁ బడుటచే నివి యహల్య చెప్పక వెలిఁబుచ్చునవి కావని, ఈగొడవ తన్ను దాఁకినదేయని నమ్మి మహాబాధపడి, అహల్యను నిందించుచు తన యాశ్రమము చేరి సందేహగ్రస్తుఁడై వెలుపవారియుండెను.

ఒకనాఁ డహల్య తన నిత్యప్రవృత్తి మాని, మితభాషణుఁడై సందేహగ్రస్తుఁడగు గౌతముని గాంచి, దరిచేరి, "స్వామీ, యేమిట్లున్నారు. మీముఖములో నేవేవో బాధలు నగ్నముగ నటించుచున్నవి. కారణ మే"మనెను.

అందులకు గౌతముఁడు "ఔ నిది నగ్ననాటిక. మీవంటి జాణలకే యిది తెలియును. మాబోటి నీరసుల కేమి దెలియును?" అని మర్మముగాఁ బలుకును. దాని కహల్య బాధపడి మరల నన్ను మర్మభాషలచే వేధింపక తమ మౌనకారణమును దెలుపుఁ డనును. కొంత సే

పట్లు వ్యంగ్యములతో గౌతముఁడు నోనాడి యామె సింకను బరీక్ష సేయ నెంచి "నా మౌనకారణ మిది. గురుకులవాసమున మన శతానందుఁడు రోగగ్రస్తుఁడైనటులు దెలిసినది. మనసు కుదురుగ లేదు. నేనాతని జూడఁబోవుచున్నాను. ఈసంగతి జనతికి చెప్పకుము. అది కుఱ్ఱది; భయపడును" అని చెప్పి వెడలెను.

ఈ సమయము గనిపట్టి కోడలగు జనతి యహల్యను జేరి అత్తా ఏమియుఁదోచనటు లున్నారేమి? మామగా రెక్కడికి వెళ్ళిరి? అనెను. మగవారి కేవో పనులు, గొడవలు. మనతో చెప్పి వెళ్ళుదురా? పని తీఱుతోడనే వారె వత్తురు అని యహల్య యనును.

ఐనచో 'మీకు తోఁచునట్లు చేయుదును. నేనొకనాఁడు ఊర్వశీ పురందరము అను ఏకాంకికనాటిక వ్రాసి మీకు వినిపించితిని. ఇది మనము ప్రదర్శింతమంటిని. మగవారు ఇంట లేనప్పుడు అట్లే చేయుద మన్నారు. నా ముచ్చట తీర్చి, నా నేర్పును గమనింపరా యని జనతి యత్తగారి నడిగెను.

అహల్య, ఇదియు బాగుగనే యున్నది. బిడ్డకు జబ్బుగానున్న సంగతికై గౌతము లేగిన నంగతి కప్పిపుచ్చుట కీప్రదర్శనము కాలక్షేప మగును. అని యూహించి, యంగీకరించెను. జనతి నారద వరప్రభావమున తన రూప మింద్రునివలె కాఁగలదని తెలిసిన దగుటచే 'అత్తా! మీరు ఊర్వశిని మించిన యందచందములు గలవారు. మీకు వేష మక్కరనే లేదని తన కీయుక్తి కనుగుణముగా నెఱపి తాను ఇంద్రుఁడై యిరువురును నా రాత్రి యానాటిక నాడిరి. రాత్రి చాల జరిగెను. ప్రదర్శనానంతరము అహల్య పరుండెను. జనతియు కృత్రిమేంద్రరూపములో నామె ప్రక్క నిద్రించినటులు పరుండెను. ఆరాత్రి గడచెను.

# శాపోపహతి

ధర్మారామమునకు పోదునన్న గౌతముఁడు రాత్రి యేదారిఁగా నింద్రుఁడు వచ్చునో యని తత్ప్రాంతముల పరిశీలించుచు నతనిజాడలు లేమి కనుచీకటి యుండగనే తన యాశ్రమమునకు వచ్చి, యింట పరిస్థితి కనులారఁగాంచి పిచ్చిపట్టినవాఁడై మహా తాపమందుచు పంచపాళిలో గూలఁబడి మూల్గుచుండెను. తన పని పూర్తియయ్యె నని జనతి సన్నసన్నగ లేచి గృహకృత్యములు చేసికొనుచుండెను. ఆ మూల్గులకు అహల్య లేచి యావైపు వెడలి గౌతముని గాంచి, బిడ్డ కేదో యాపద వాటిల్లె నని భావించి, గుండెలు కూల గౌతముని జేరి మిగుల తహతహతో నాతనిని తట్టుచు ప్రశ్నపరంపరలో ముంచెను. గౌతముఁడామె తాకినందుల కుద్రిక్తుఁడై "నీ చర్యలు వింటిని- కనులతో కంటిని. ఓసి జారిణీ! 'జారవనితలయెడఁద పాషాణము' తథాస్తు" అనెను. వెంటనే యది శాపమై యహల్యను ఱాయిగా మార్చుచుండెను. ముక్కుమూలము లేని యీ శిక్ష నా కేల? నేనా! జారిణినా? స్వామీ! తమ దివ్యదృష్టి ఏమైన దనెను. అప్పటికి మెడవర కామె ఱాయిగా మారెను. జ్ఞప్తికి తెచ్చిన యోగదృష్టిని లగించి గౌతముడు సత్యముఁ దెలిసి, పశ్చాత్తప్తుఁడై యహల్యను జేరి, తన యవిమృశ్యకారితను ఆమె నిర్దోషతను చెవిలోఁ జెప్పి, 'రామపాదరజస్సుతో శాపమోక్ష' మనుచు, ఆరూపమొందిన తన పత్నియొద్దనే తానును స్మృతిఁదప్పి పడియుండెను. జనతి యిదంతయుఁ గనుచు తేలుకుట్టిన దొంగవలె మాటాడని దయ్యెను.

ఈసమయమునకే శతానందుఁడు ఇంటికివచ్చి యచటి పరిస్థితి యర్థముగాక తండ్రి నడిగియు నుత్తరమందలేక తనదివ్యదృష్టిని సారించెను. అతని కన్నియుఁ దెలిసెను వెంటనే యాతఁడు తనభార్య జనతిని బిలిచి తలవాచునటుల చీవాటులువేసి ఓసీ నీప్రవృత్తి రాక్షసప్రవృత్తి వంటిది. రాక్షసీ! తాటకా! తథాస్తు అనెను. వెంటనే యదిశాపమై జనతిని వికృతాకార మావరించును. జనతి తనతప్పు నొప్పుకొని పతిని క్షమింపవేఁడును. అతడు ఆర్షవాక్కుకు తిరుగులేదు, స్వయంకృత మనుభవింపు మనెను. నాకీవికృతాకృతికన్న మరణ మిమ్మని యామె దీనముగ వేడగా ముని మెత్తబడి మాయమ్మను దరింపఁజేయువాఁడే నీకును తారకుఁ డౌను పొమ్మని చెప్పి, తల్లిజయించిన జనస్థానదేశములను తన మామగారికి మరల నొసంగి కూతునుగురించి వారికిఁజెప్పి తాను పితృసేవాపరుఁడై యుండెను.

## శాపమోక్షము

విశ్వామిత్రుఁడు తన యాగసంరక్షణమునకై రామలక్ష్మణులను గ్రహించి యది తీఱినవెనుక సీతాస్వయంవరమునకై దండకమీఁదుగా మిథిలకు వారిని తీసికొనిపోవుచుండెను. దారిలో వారికి మలదకరూశ దేశములు తగులగా నీదేశములిట్లు నిష్పచ్చరముగనుండ గారణమేమని రాముఁడు విశ్వామిత్రునడుగును. వృత్రాసురసంహారమున నింద్రునికి గలిగిన బ్రహ్మహత్యాదోష మీప్రదేశములందు కడుగబడుటచే నీ దేశములకు పాఁడిపంటలు లేవు.

మఱియు శతానందునిచే శపింపఁబడిన జనతి బొమ్మరక్కసియై తాటకయనుపేర నిచటనేయుండి సర్వజీవుల కుపద్రవము గలిగించును.

రామా నీవీయిబ్బందులను దొలగించి దేశోద్ధరణ మొనర్పవలెనని ముని యనుచుండఁగనే తాటక వారినిమిత్రింగ విచ్చేయును. ముని రాముని బ్రోత్సహించి తాటకాసంహారము చేయింపగా నామె జనతిగా మారును. విశ్వామిత్రుఁ డామెనుగూడ వెంటఁబెట్టుకొని యహల్యా శాప మోక్షమునకై రాముని గౌతమాశ్రమమునకుఁ గొంపోవును. గౌతమ శతానందు లాయతిథివర్గమును మన్నించిరి. అచట రాయాఫునమున్న యహల్యకు రామపాదధూళి తగులునటులు విశ్వామిత్రుఁ డాతని నడిపింపగా నహల్యయథాస్థితికి వచ్చి పతిపాదముల నంటెను. జనతియు శతానందుని పాదపద్మముల వ్రాలెను. ఇదంతయు నావలననే జరిగినదని విశ్వామిత్రుఁ డామునిదంపతులను గలిపి రాఘవులతో మిథిలకు పయనము సాగించెను.

# అహల్యలోని కవితావిశేషములు

సీతాయనమనెడి పాళీభాషలోని రామాయణమందలి అహల్య కథ నాధారముగ గ్రహించి విద్వత్కవులు శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి రసవంతముగఁ జెప్పిన యొక కథానికా కావ్య (Narrative poem) మీ అహల్య. ఈ కావ్యారంభమున 'విజ్ఞప్తి' యను శీర్షిక యున్నది. ఇందు కవి అహల్యాదేవిని సంభోధించి లౌకికవైదికసాహిత్యములం 'దాబ్రహ్మమానసపుత్రి, గౌతమమహర్షి ధర్మపత్ని, దేవత్వము, నార్షత్వము నొకేయుపాధి నాశ్రయింపఁగా నెగడినమాతృశ్రీ'ని గూర్చి లోకమున నున్న కథలోని దోషములను,

వైదికసాహిత్యమందలి గాథయొక్క యంతరార్థమును, సీతాయన మందలికథలోని వైశిష్ట్యమును బరామర్శించిరి.

ఈయహల్యకావ్యము జననాది; వరదానము, విజయము, ఉపదేశము, ఉపక్షేపము, శాపోపహతి, శాపమోక్షములను నుపశీర్షికలతో నొప్పి యాధునికసాహిత్యమున నొక మనోజ్ఞకావ్యముగ నవతరించినది.

ర చ నా కా ర ణ ము

శ్రీదువ్వూరివారికృతి రచనకుఁ బూనుకొనుటకు సీతాయన మందలి అహల్యకథాభేదము వారి నాకర్షించుటయే కారణము. ఈ కథావైవిధ్యమే తమ కావ్యరచన కుద్బోధక (Incentive) మని

“నీనాణ్యంబును నీసతీత్వమును రాణింపన్ సుశోభావి ని
దారిణం బందలి నీకథానికయు మాతా! హాళివాటించి, న
న్నానందాంబుధి నోలలార్చినది, హృద్యంబైన కావ్యంబుగాఁ
దానై సత్కృతి కూర్చుమన్నదియు; చేతం బూనితిన్ లేఖినిన్”

అని తెలిపినారు. మహర్షి వాల్మీకి తా దర్శించి కథను దెల్పినాఁడు. కాని నేఁటికవులు కొంద ఱభావ్యపద్ధతితోఁ దోఁచిన రీతి నహల్య నొక జారకాంతగాఁ దిద్దుటచే నట్టి కథలు'' శివేతరక్షతికి (అశుభనాశనమునకు) బ్రయోజనకారులు కాకుండుటవలనను, మనుజబుద్ధులకు గోచరములుగాని దేవతారహస్యములతోఁగూడిన ఋషిప్రోక్తగాథలఁ దడవక లోకవృత్త మెఱిఁగి ధర్మమును జాటుటయే కవి కుత్తమధర్మ మని నమ్మి కవి నట్టిగుణములు గల 'యీఅహల్యాకథ' యాకర్షించి కావ్యముగ పలికించినది.

క థా క థ న ము

శ్రీదువ్వూరివారు కథాకథనమున కావశ్యకములైన సర్వగుణములతో నీకావ్యమును నౌచిత్యశోభితముగను, రసవంతముగను, జగద్హితముగను జెప్పినారనుటలో సందియము లేదు. కథాకథనరీతిని గావ్యమును జెప్పుకవి కావశ్యకము లైన సంభాషణారచనము, సందర్భోచితవర్ణనానైపుణ్యము, పాత్రిలచిత్తవృత్తుల నౌచిత్య మెఱిఁగి సమయోచితముగఁ బ్రదర్శించుట, వస్తువున కనుగుణమగు 'నుపకారపుఁదీరులు' నిందు సమృద్ధములు.

సం భా ష ణ లు — స్వ గ త ము లు

అహల్యాగౌతముల ప్రేమోల్బణప్రసంగములు, వారు సత్రావహునిగూర్చి యొనర్చిన సంభాషణము, పరిత్రావహుఁడు నారదునితో నహల్యనుగూర్చి పలికిన వాక్యములు,కుహనామునిదంపతులు అహల్యశీలమునుగూర్చి చేసిన సంభాషణములు, అహల్యాశీలమును శంకించి నపుడును బిమ్మట నొకశయ్యపై నిదురించుచున్న కృత్రిమేంద్రాహల్యలఁ జూచినపుడు గౌతముఁ డొనర్చిన ధ్వనివ్యంగ్యగర్భితప్రసంగములు దువ్వూరివారి సంభాషణావిరచినచాతుర్యమునకు నిదర్శనములు.

వ ర్ణ న లు

వీరి వర్ణనలు రసానుగుణములు. ప్రయోజనసహితములు. తొలుకాఱు నందలి వర్ష వర్ణనమును, గౌతముఁడు ధర్మపత్నియగు నహల్యను శిలవు గమ్మని శపించినపుడు ప్రకృతి దుఃఖించుటయు నిట్టివే. వర్షము లేకున్న గౌతముఁడు కృత్రిమమునిదంపతుల పంచ జేరఁడు. ప్రకృతి దుఃఖింపకున్న గౌతముని హృదయ మింతుక చలించి యతనిని

యోగదృష్టితో సత్యమును గ్రహింపఁజేయుటకు చేరి రేపింపదు. తాను వర్ణించు వస్తువును సమ్యగ్దృష్టితో భావించి దర్శించి వర్ణింపఁగల కవిశక్తికి శిలారూపపరివర్తన మందున్న క్రింది యహల్యావర్ణనము చక్కని నిదర్శనము.

"కదలింపంబడు నూర్ధ్వకాయము నధఃకాయంబు తారూపునన్
మెదలం జాలదు, దీనదృష్టులను గన్నీరుబ్బు, పెం పేది బె
ట్టిద మూచున్ జడమౌ; మృదుత్వమును గాఠిన్యంబునుం బొందనై
బ్రిదుకుంజావు లహల్యదేహమున సంప్రాప్తించె నొక్కమ్మడిన్"

క వి తా ల క్ష్య ము

ఉత్తమసతి యైన యహల్యకు శిలారూపశాపము గలిగినపుడు గౌతముఁడు యోగదృష్టితో సత్యమెఱిఁగి గళముదాక తారూపు నొందిన యహల్యతో "జయమ్ము నీది, యపజయము నాది" యని పలికించి యుత్తమసతీత్వమునకు ఫలమును గూర్చుటయు; గౌతముని బ్రతిశాపదగ్ధునివలె ధర్మపత్నిసన్నిధానమున జడరూపమున నిల్పుటయు, జనులకి శాప మిప్పించిన పిమ్మట 'చేజేత నయిన దురిత, మను భవింపక తీఱునే యజునికైన' యను సూక్తిని నిల్పుటయు నీకవికిఁగల "లోకప్రవృత్తి నెఱిఁగి ధర్మమును జాటుట" యను నుత్తమకవిత్వాశయమునకు నిదర్శనములు.

భా షా ది క ము

పాత్రలసంభాషణములందును, కథాకథనరీతులందును నీకావ్యము నుడికారపుసొంపులతో నొప్పుచున్నది. చక్కని లోకోక్తులు (అగ్గికిం జెదలుపట్టునె; రూపవతిభార్య పరమశత్రువు; కొండయే తేలి

మున్నెనా బెండు ఇత్యాదులు) జాతీయములతో (నూర్నవులు, దెబ్బ దేవేంద్రలోకము, ఆడమ్మల గోలలు, బూడిదబుస్సన, మోరలెత్తు, ముంగిళ్ళుచిన్నవోవు, తేలుకుట్టినదొంగ). సంస్కృతాంధ్రసమపదమ్మై శ్రీమద్వ్యారివారిభాష 'గరువంపునడక' కలిగియున్నది. వరివస్యల్, ఆర్జ్యవ్యము, సాద్గుణ్యము, జాగ్రియ, కదర్యులు ఇత్యాదిశబ్దముల ప్రయోగించుట శ్రీ శాస్త్రిలవారి 'శబ్దసంస్కార'మును వెల్లడించుచున్నది. వీరిభాషయందు కథావస్తువున కనుగుణమైన 'పావిత్ర్యము' విశేషముగ గోచరించుచున్నది.

ధ్వనిరసభావాది ప్రధానకావ్యగుణములతోనొప్పి యాధునిక కావ్యప్రపంచమున కొకచక్కని వినూతనరత్నమునిచ్చిన విద్వత్కవులు శ్రీదువ్వూరివారు ప్రశంసనీయులు.

## అహల్యాకథ : సంస్కృతాంధ్రసాహిత్యములు

సంస్కృతసాహిత్యము

భారతనారీమణులచే నిత్యమును పంచకన్యలలో * నొక్కతెగా స్తుతింపఁబడుచున్న పతివ్రతామణి అహల్య. ఈమె జీవితకథ యతి పురాతనమైనది. నేఁడు లోకమునఁ బ్రచలితమగుచున్నకథ కాధారభూతమైన యుద్గ్రంథము వాల్మీకిరామాయణము. అందు బాలకాండమున (48 సర్గ శ్లో॥ 15 మొదలు 49 సర్గ శ్లో॥ 13 వరకును) అహల్యాకథ

---

*అహల్య, ద్రౌపది, సీత, తార, మండోదరులు పంచకన్యలు. వీరిస్మరణ మహాపాతకనాశనము. (అహల్యా ద్రౌపదీ సీతా తారా మండోదరీ తథా, పంచకన్యాః స్మరేన్నిత్యం మహాపాతక నాశనమ్)

యున్నది. దీని యాధారమున తరువాతి లౌకిక సాహిత్యమునం దహల్యకథ నానారూపములఁ బొందినది.

వాల్మీకిరామాయణమున కాధారము వైదికసాహిత్య మనుటలో నెట్టి సందేహమునకును దావులేదు. అహల్యగాథకు "అహల్యాయై జార !" యను వైదికమంత్రి మాధారము. వేదవాఙ్మయమందలి బ్రాహ్మణములందు — శతపథము (III, 3, 4, 8) షడ్వింశమునందు (II), జైమినీయము (II, 79) – 'ఇంద్రున కహల్యా జార' యను సంబోధన మతి ప్రీతికరమైనట్లు తెలియుచున్నది. లౌకికార్థమును జెప్పుకొని నపు డింద్రుఁ డహల్యతో వ్యభిచరించినవాఁడని దీనివలన వ్యక్తమగుచున్నది. కాని యీ మంత్రమున కర్థ మిది కాదనియు, వైదికార్థము లున్నట్లును సంప్రదాయజ్ఞులవలనఁ దెలియుచున్నది.

"అహల్యాయైజార"యను మంత్రమును వ్యాఖ్యానించుచు సుప్రసిద్ధ మీమాంసకుఁడు కుమారిలస్వామి, ఇంద్రుడు సూర్యుఁడనియు, అహల్య రాత్రి (Primeval darkness that preceeded creation) యనియు, సూర్యుఁడు రాత్రియందు లయించుటచే జారభావము వహించుచున్నాఁడనియు నర్థము చెప్పినాఁడు. అందువల్లనే యింద్రుడు 'రాత్రిజారుఁడు', 'మాత్రిజారుఁడు' (ఏ తల్లి గర్భమునుండి పుట్టుచున్నాడో యా తల్లియందు లీనమగువాఁడు) అను నర్థములుగల పదములతో వ్యవహరింపఁబడుచున్నాఁడని యతఁడు వ్యాఖ్యానించినాఁడు. అతఁడు వ్యాఖ్యానమున స్పష్టముగ నింద్రుని జారత్వము పరస్త్రీ వ్యభిచారమువలనఁ గలిగినది కాదని తెలిపెను. బృహదారణ్యకోపనిషత్తునకు వ్యాఖ్యానమొనర్చిన భట్టభాస్కరుఁ డహల్యా శబ్దమునకు

వాక్కునియు, వాంశబ్దమునకు ప్రీతుడనియు అర్థమును జెప్పి అహల్యాజార యని గుణాధిక్యముచే నతిశయించిన నిన్ను స్తుతింప సమర్థమైన వాక్కును ప్రేరేపించువాఁడా, అనగా వాక్కుచే స్తుతింపఁదగినవాఁడా, యని సమన్వయించెను.

లౌకిక సాహిత్యమునందు కన్పించు నహల్యా కథలో నింద్రుఁ డహల్యను బొందు సందర్భమున నహల్య యింద్రుని కామించి తప్పిద మొనర్చిన దని యొక మతమును; ఇంద్రుఁడే గౌతముని వేషమున వచ్చి యామెను మోసగించి, యామెను కలియుటచే నామె తప్పిదమును తెలిసిచేయలేదని యొకమతమును గన్పించుచున్నవి. అహల్యా దోష మజ్ఞాతకృతమైనను జ్ఞాతకృతమైనను గౌతముఁ డిచ్చిన శాపము విషయమునను భిన్నమతము లున్నవి.

గౌతమవేషమున వచ్చిన యింద్రుని దేవరాజని యెఱుఁగక తన పతియేయను నుద్దేశముతో నహల్య యతనిని గూడినట్లును, నందువలన నామె దోష మజ్ఞానకృతమైనట్లును అధ్యాత్మ రామాయణ, పద్మపురాణ, ఆనందరామాయణాది కథవలనఁ దెలియుచున్నది. అహల్య దుష్టబుద్ధియై వచ్చిన మునివేషి యింద్రుఁడని యెఱిఁగి కుతూహలముతో నతనినిఁ గూడినదని వాల్మీకిరామాయణ, బ్రహ్మపురాణాది కథలవలనఁ దెలియుచున్నది. వాల్మీకిరామాయణమున నహల్య యింద్రునితోఁ గూడినపిమ్మట నతనితో 'నేను కృతార్థురాల' నయితి ననిగూడ ననినది. ఆదికవి దృష్టిలో నహల్య దుష్టబుద్ధి.

గౌతముఁ డహల్యకు శిలాప్రతిమరూపమును బొందుమని శపించి నట్లు నత్యోపాఖ్యానమునందును, ఆనందరామాయణము నందును

నున్నది. వాల్మీకిరామాయణమున 'వేలకొలఁది యేండ్లుగా నీవు గాలిని పీల్చుకొనుచు నిరాహారమేదియు లేక బూదిలోఁ బడుండి, ప్రాణుల దృష్టినిఁబడక తపించుచు నాయాశ్రమమం దుండుము' అని గౌతముఁ డహల్యను శపించినట్లున్నది. 'నాయాశ్రమభూమిలో నొక చఱియమీఁద నీవుండవలసిన' దని యధ్యాత్మ రామాయణమందలి శాపము। 'ఓపాపచారిణీ! యెముకలతోడను చర్మముతోడను మిగిలి మాంసమును గోళ్ళను లేనిదానవై నలుగురును, నిన్ను జూచుచుండఁగా చిరకాలము నీ వుండిపొమ్ము" అనునది పద్మపురాణమందలి గౌతమశాపము. బ్రహ్మపురాణమున గౌతముఁ డహల్యను "నీ వొక యెండిపోయిన నదివి కమ్ము" అని శపించి "నీవెపుడు గౌతమీ నదితో గలసెదవో యపుడు నీకు శాపమోక్ష మగు" నని చెప్పినాఁడు.

లౌకికసాహిత్యమందలి యహల్యాకథయందుఁ గన్పించు రెండు మతములలో నొకదానియం దహల్యదుష్టబుద్ధి, రెండవదానియందు పవిత్రురాలు. రామకథకు మూలమైన యాదికావ్యమునం దామె దుష్టబుద్ధి. గౌతమవేషమున వచ్చినది దేవరాజని యెఱిఁగి కుతూహలముతో నతనిని గలిసి పిమ్మట కృతార్థురాల నైతి నని పలికినది. ఇట్టి కల్పనమొనర్చుటలో వాల్మీకి యభిప్రాయ మేమి? తన కథానాయకుఁ డగు రామునకు పతితపావనత్వ మనెడి లక్షణమును కల్పించుటకని కొందఱూహించిరి. కొందరు 'రామాయణము మహామంత్రములకు వ్యాఖ్యానప్రాయమైన గ్రంథమనియు, అహల్యాకథ యొక మహామంత్రవివరణమైన కథయనియు చెప్పుచున్నారు.

వాల్మీకిరామాయణమున నిది ప్రక్షిప్తభాగ మనియు, రామునకు సర్వేశ్వరత్వ మభ్యుపగతకాలమున నిది యందు ప్రవేశించినదనియు నాధునిక విమర్శకుల యభిప్రాయము. అథర్వవేదశాఖీయులు క్రతుప్రియులునైన భార్గవాంగిరసులు మహాభారత రామాయణములలో ననేకములఁ జేర్చి పెంపొందించినట్లు పరిశోధకమహాశయు లభిప్రాయపడుచున్నారు. † వాల్మీకిరామాయణమందలి యహల్యాకథ ఐతిహాసిక కాలమున కల్పితమైనదనియు అదియ వాల్మీకమనియు, విష్ణుభక్తులు (భాగవతులు) రామమాహాత్మ్య నిరూపణాత్మకముగ నీకథను బ్రాహ్మణములందలి సాంకేతికగాథ (Allegoric Legend) నాధారముగ కల్పించిరనియు" మరియొక యభిప్రాయము.*

దీనినిబట్టి యహల్యాకథ తొలుత నొక సాంకేతికగాథ యనియు నది కాలక్రమమున రామపతితపావనత్వ నిదర్శనముగఁ బరివర్తన మొందిన దనియు నర్థమగుచున్నది.

---

† "The Ramayana of Valmiki and Bharata of Vyasa may have been independent products of Eastern and Western parts of India respectively. When the Bhargavangirasas attempted to transform the Bharata into Maha Bharata, they must have also handled the Ramayana of Valmiki and absorbed in the Maha Bharata in the form of its condensed summary" — Dr. Suttankar. (Indian Studies P. 303)

* "The story (of Ahalya) is a fine specimen of a Brahminic legend or Allegory and its gradual adoptation by the devotees of Vishnu is to serve their own purpose. It is clear that the Epic Version of the story belongs to a period when the name of the dust of the feet of Rama had not been established. Shende (Jha Commemoration Volume P. 432)

బ్రాహ్మణములందలి 'అహల్యాయై జార!' యను పదమునకు వాక్కును బ్రేరేపించువాఁడు, రాత్రితో లయించువాఁడు, అని సాంకేతికార్థములయినట్లు పైన వివరింపఁ బడినవి. అంతేకాక (అ= లేదు, హల=నాఁగలి) దున్నఁబడని నేల; ఇంద్రుఁడు మేఘాధిపతి యగుటచే నట్టినేలపై వర్షించుటయే యతనిజారత్వముగఁ జెప్పఁ బడిన దని మఱియొకయభిప్రాయము. †† "అహల్యాగౌతము లిరువు రును బురాణపాత్రలు కాక యహల్య కొండభూమిగాను, గౌతముఁడు గోదావరిగాను, ఈతనిచే నాభూమి తడుపఁ బడుచుండుటనే యీగాథ సూచించు ననియు, ఇది వసుచరిత్ర వంటిదనియు నేఁటి రాసాయనిక వేత్తల భావన.

ఆంధ్రసాహిత్యము—అహల్యకథ

రంగనాథరామాయణమున అహల్య యింద్రు నెఱిఁగియే భోగించినట్లును, గౌతముఁ డింద్రుని "అముష్కుండవు" కమ్మనియు, అహల్యను శిలారూపమును పొందు మనియు శపించిన ట్లున్నది. భాస్కరరామాయణకర్తయును గౌతమవేషమున వచ్చినవాఁ డింద్రుఁ డను జ్ఞానముననే యహల్య యింద్రుని పొందు నొందినట్లున్నది. ఆమెచే కవి 'ముదమందఁగ నిక్కడ రమ్ము గ్రక్కునన్, మనసిజు నమ్మలం దునిసె మానము చిక్కిన మన్మథుండనై' నను రతిచాతురిం గలిసి నన్నును నిన్నును గావు మనిపించినాఁడు. ఆంధ్రసాహిత్యము

†† "Another Version of the story is this — Ahalya (A = Not, H A L A = a plough and aff ya) means unploughed land; and Indra is the God of rain. So the story of Indra's connection with Ahalya may also refer to the conversion of cultivable but unploughed land into fertile one" Kale (Notes Raghu Vamsa Cantos XI—XV P. 13)

నందలి ప్రాచీన రామాయణములం దహల్య యొకఁగి యొకఁగి యింద్రునితోఁ జీకటితప్పు గావించినట్లే యున్నది.

దక్షిణదేశాంధ్రసాహిత్యయుగము విశేషముగ శృంగారరసము నకు సందునుఁ బరకీయారతికినిఁ బ్రాముఖ్యమిచ్చి ప్రబంధరచన సాగించిన కవిపుంగవుల కావ్యరచనలతో నన్నెకెక్కినది. ఆ యుగమున సముఖము వేంకట కృష్ణప్ప నాయకుఁడు 'అహల్యాసంక్రందన' మనెడి నెఱసచ్చి శృంగార ప్రబంధమును జెప్పినాఁడు. ఆంధ్రభాషలోని విచిత్రరామాయణమునందలి యహల్యాకథ చిత్రాతిచిత్రముగ నడిచినది. ఇందు గౌతమునివలన నహల్యకు నొక కూఁతురును, సూర్యేంద్రుల వలన నిరువురు కుమారులును బుట్టినట్లును, ఆ కుమారులు గౌతముని సంతతి కానివిషయమును కుమార్తె తండ్రితోఁ జెప్పఁగా నాతడు వారిని సముద్రములోఁ బారవైచి, భార్యను శపించినట్లును, కూతురు దన గుట్టును బయల్పెట్టుటచే గోపమున నీవు గుడ్డిదాననై యుండుము. నీయందు వానరుఁడు జన్మించునని యహల్య శపించినట్లును నున్నది.

ఆధునికాంధ్రసాహిత్యమున నహల్యాకథ చెప్పిన రచనలలో శ్రీ మంత్రిప్రగడ సూర్యప్రకాశరాయకవి సీతారామచరిత్రమును, శ్రీ తాడేపల్లి వెంకటప్పయ్యశాస్త్రి శ్రీరామకథామృతమును, విశ్వనాథ రామాయణమును, శ్రీపాదవారి శ్రీకృష్ణ రామాయణమునుఁ బ్రముఖములైనవి. సూర్యప్రకాశరాయకవి యహల్యాకథ శృంగార ప్రబంధధోరణిని నడచినది. అహల్యాశచీభర్తల పరస్పరానురాగములు కామవిలాసములు నిందు నిర్మలములుగ వర్ణితము లైనవి. ఇక నహల్య పాతివ్రత్యపోషణమును గూర్చి చెప్పవలసినపని లేదుకదా,

విశ్వనాథరామాయణమున నింద్రుఁ డహల్యకై దీర్ఘకాల మోహగ్రస్తుఁడైనాఁడు. అహల్య యతఁ డింద్రుఁడని యెఱిఁగియే యతనితోఁ గామకేళిఁ దేలినది. రామ పతితపావనత్వాధిక్యమును నిరూపించుటయే విశ్వనాథ రామాయణమందలి యహల్యకథోద్దేశ్యముగ ద్యోతకమగుచున్నది. శ్రీరామ కథామృతమందు నహల్య జ్ఞాతదోష కాదు. మునివేషమున వచ్చిన వాఁ డింద్రుఁడని యామె యెఱుఁగదు. అదోష యగు నహల్య భర్తను యోగమహిమచే తన తప్పిదము లేనితనము నెఱిఁగి తగినరీతి శిక్షింపుఁడని వేఁడుకొనినది.

శ్రీకృష్ణరామాయణమునందలి యహల్యకథకు మూలము బ్రహ్మాండపురాణాంతర్గతకథ. ఇం దహల్య జ్ఞాతదోష కాదు. గౌతమ వేషమున వచ్చిన యింద్రుఁ డామె హస్తగ్రహణ మొనర్చి లోనికిఁ దీసికొనిపోవునపుడే యామె యతని నింద్రునిగాఁ నెఱిఁగి నిందించుచున్న వేళ మునివచ్చి యతనిని శపించెను. గౌతముఁడు ఇంద్రునిఁ జూచి శపించినపిమ్మట నహల్యను శిలవుఁ గమ్మని శపించెను. రామ దర్శనము విమోచనముగఁ బల్కెను. రాముఁ డామెకు పంచకన్యలలో ప్రథమగణ్య యగుటకు స్థానము గల్పించెను. శ్రీకృష్ణ రామాయణమున పూర్వకథయందు గన్పించు దోషములు సరిదిద్దఁబడినవి. కాని యవాల్మీకములు. పతితయైన యహల్య నుద్ధరించిన రామ మాహాత్మ్యమున కిందు స్థానము తప్పినది. శత్రుని హస్తస్పర్శకే గౌతముఁడు ధర్మపత్నికి శిలారూపశాపము నిచ్చునంతటి తీవ్రకోపియైపోవుటయు నిందుఁ గమనింపఁదగినది. ఘనతపోనిరతుఁడై యింద్రియవిజయమును గొన్న గౌతముఁ డిట్లుప్రవర్తించినాఁ డనుటలోఁగల యౌచిత్యమేమి? విధిసహాయము లేనిది దీనిని సమర్థింపఁగలమా?

అహల్య, ద్రౌపది, సీత, తార, మండోదరు లను నైదుగురును పంచకన్యలనియును, బరమ పతివ్రతలనియును, వారిస్మరణ మహా పాతకనాశనమనియును జెప్పు నొక శ్లోకమున్నది. ఇందు సావిత్రి, దమయంతి, అరుంధతి, లోపాముద్రాది పతివ్రతలలో నొక్కతె యైనఁ బరిగణింపఁ బడలేదు. అదియునుఁగాక పైన పేర్కొనఁబడిన యైదుగురి శీలవిషయమునను సనుమానమును గల్పించెడి గాథలున్నవి. ద్రౌపది పంచభర్తృకత నొకరీతిగ సమర్థించుకొన్నను నామెకు కర్ణునిపై ననురాగముండుట, దేవగురువగు బృహస్పతికిఁ బత్నియగు తారకు చంద్రసంపర్కముండుట, వాలిభార్య సుగ్రీవునికిఁ గొంతకాలము దేవేరిగ నుండుట, రావణపత్నియగు మండోదరి వాలివలన సంగమని గనుట వీరిలో నలుగురిశీలములందుఁ దోఁచు కళంకములు.

అహల్యయెడ నింద్రసంబంధము దోషము. యుగ, దేశ, జాతి ధర్మముల ననుసరించి యా యా యాచారముల ననుసరించుట వలన వారిని పతివ్రతలుగాఁ దలపోయకుండుట తప్పిదమని తెలుపుటకో, లేక వారిచర్యల లౌకికదృష్టితోఁ బరిశీలింపఁ దగినవి కాక పోవుట వలననో పూర్వు లట్లనుమానింపఁబడెడి వారిని మాత్రమే పేర్కొని వారిని మహాపతివ్రతలనియును, వారిస్మరణ పాతకనాశక మనియును జెప్పిరి.

నేటిరామాయణమున 'అహల్యకథ' యున్నది. ఇది వాల్మీకి కృతము కాదనియు, ప్రక్షిప్తమనియు, కాదు వాల్మీకికృతమేయనియు మతభేదము లున్నవి. ఈ కథ వాల్మీకికృతమైనను, ప్రక్షిప్తమైనను రామాయణమున నుండుటకుఁ గల కారణ మెయ్యది? వాల్మీకి

రామాయణమున నున్నకథను బరిశీలించినచో మహర్షికిఁ బత్నియై యింద్రునితో నెనఁగి వ్యభిచరించి భర్తృశాపమున దుస్థితి ననుభవించుచున్న అహల్యను శ్రీరాము డుద్ధరించుట గనవచ్చుచున్నది. ఈయుపాఖ్యానము రామపరమేశ్వరత్వమును, మహాత్మ్యమును నిరూపించుచు, నాతని పతితపావనత్వమును ద్యోతకమొనర్చుచున్నది. అనఁగా రామపతితపావనత్వమును నిరూపించు నుద్దేశముతోనే యిందీకథను వాల్మీకి చెప్పినాఁడు. లేదా ప్రక్షిప్తముచేయబడినది యనుట. ఇట్టియుద్దేశముతో నున్న యుపాఖ్యానమునఁ బతితగాఁ జిత్రితమైన యహల్యా శీలలోపముల రామాయణానువాదముల సరిదిద్దయత్నించుటలో నుద్దేశ ముదాత్తమును, సత్ఫలదాయకము నైన దైనను ప్రధానోద్దేశ మైన 'రామపతితపావనత్వ గుణమున కట్టి మార్పులు భంజకము, లని గమనింపవలసియున్నది. రామపతితపావనత్వశక్తి యెంత యతీతమైనదని నిరూపింప దలఁచిన అహల్య నంతటి "పతితను" గా నిరూపించుటయే సమంజసము. భగవదవతారమైనరాముని చరిత్రలో నహల్య మహర్షి పత్నియయ్యు నార్షమహత్వ మెఱుఁగఁజాలక యజ్ఞానమున దేవరాజునుజూచి మోహించి పతితయైన వ్యక్తిగనే నిరూపింపఁబడుట యత్యావసరముగదా! ఒక పాత్రను జిత్రించుటలో, నరుదును నర్థవాదమైన కథలో కవి యుద్దేశ్యమేమో గమనింపవలయును. ప్రత్యేకముగ"అహల్య"కథను కావ్యముగఁజెప్పి లోకహితార్థమై యుత్తమనీతిని గఱపునప్పుడా మెను బరిపూర్ణముగ లోపరహితను గావించుటలో నెట్టి యనౌచిత్యము నుండదు. ఇందుకుఁ బ్రయోజనము వేఱై యుండుటయే కారణము.

# సీతాయనము - అహల్యకథ

మన పాఠ్యగ్రంథమగు "అహల్య"కుఁ గథావస్తువు సీతాయనమను పాళీభాషారామాయణమునుండి సముద్ధృతమైనది. ఈసీతాయనమును రామబ్రహ్మానంద మను నొక పండితుఁడు నేపాళ దేశమునుండి సంపాదించినాఁడట! ఈ కావ్య వైశిష్ట్యమునుగూర్చి శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారిట్లు పీఠికలోఁ బ్రశంసించిరి.

"ఇతివృత్తమ్మున భిన్నవృత్తి, రచనాహేవాక, మాదివ్యని ర్మితిలో భావనిబంధనానుగతి, యాత్మీభూతసద్రీతి, య ద్భుతపాత్రోచితి యాదికావ్యమున యందుంబోలెఁ జూపట్టునా కృతి సీతాయనమందు, రాక్షముగసాఁగెన్ దాని వాగ్వైఖరుల్."

శ్రీ దువ్వూరివా రన్నట్లు సీతాయనమందలి యహల్యకథ భిన్న రీతిని నడచినది. ప్రతీకారేచ్ఛతో వియ్యంకుఁడైన ప్రకాశ్రవహుఁడు కుమార్తెయగు జనతిచే నూర్వశీపురందర రూపకమును వ్రాయింపఁగా నం దహల్య యూర్వశీ పాత్రను ధరించి, ప్రదర్శనానంతరమున నేకశయ్యపై నూర్వశీ-పురందర పాత్రధారిణు లిరువురు నిదురించువేళఁ బూర్వమే కృత్రిమ మునిదంపతుల సంభాషణ మూలమునఁ దన ధర్మపత్నిని శంకించుచున్న గౌతముఁడు జాలమార్గమునఁజూచి శిలారూపవు గమ్మని శపించి పిమ్మట సర్వమెఱిఁగి పశ్చాత్తప్తుఁడగునట్లును, శాపాంతమును బ్రసాదించునట్లును జెప్పఁబడుటచే నీ అహల్యకథలోని యితివృత్తము భిన్నరీతిని నడచినదనుటలో సందియము లేదు.

స్వీకరించిన కథలోని పాత్రల నన్నిఁటిని కవి సమంజసముగఁ బోషించినాఁడనుట సత్యము. ఇందు "అహల్య" సతీత్వము, అమాయ

కత్వము. గౌతముని చిత్తవృత్తిరీతులు, ప్రక్రాసహుని ప్రతీకార తత్పరత లుచితరీతిని పోషింపఁబడినవి. ప్రతి పాత్రయు విస్పష్టరూపరేఖల తోను, చిత్తవృత్తులతోను, చేష్టలతో నొప్పి కనులకుఁ గట్టుచున్నవి. అహల్య నుద్దేశించి సీతాయనమందలి యామె కథనుగూర్చి తెలుపుచు కవి "నీ నాణెంబును, నీ సతీత్వమును రాణింపఁగ సుశోభావినిద్రాణం బందలి నీ కథానికయు"అని పలికినాడు. ఈకథ ప్రధానముగ నహల్యా పాత్రచిత్రణాకై యిందుఁ గల్పితమైన ట్లున్నది. సీతాయనకృతినిజూచిన గాని యందు "అహల్యా"కథ కెట్టి స్థానమున్నదియో, యా యుపాఖ్యానమున దాని యావశ్యకత యెట్టిదియో, తత్కర్త వాల్మీకిరామాయణమునకు భిన్నమైన యిట్టి కథాకల్పనమును గావించుటలోఁ గల యుద్దేశమేమియో తెలుపుట కవకాశము లేదు.

సీతాయనమం దొక కథ యున్నది. దానిని గూర్చి విచారించునపుడు శ్రీదువ్వూరివా రన్నట్లుగ నిది యార్షమైన (ఋషిప్రోక్తము) కథయా? యని చర్చింపఁబనిలేదు. లోకమందున్న కథను గ్రహించి దానికి భిన్నముగ నున్న యిందలి కథ సంభావ్యమా? కాదా? యని యూహింప నవసరము లేదు. ఇది యొక కథాభేదము. కల్పభేదమున ననేక కథాభేదము లుత్పన్నములగును. ఇందు కవి గ్రహించినవస్తువు నెట్లు నిర్వహించినాఁడని గమనించుటయే మన కర్తవ్యము.

'లోకవృత్త మెఱిఁగి ధర్మమును జాటు నుద్దేశముతోఁ గావ్యరచనకు'గడఁగిన కవికీ కథావస్తువు రమణీయమైనదనుటలో విప్రతిపత్తి యుండదు. ప్రసిద్ధమైన "అహల్యాసంక్రందన" కథలోని దోషమును దొలఁగించి యహల్య శీలరక్షణ మొనర్చుటను ఊర్వశీపురందరు

రూపక పరిదర్శనము కావలసి వచ్చినది. అందుటకు జనతి యవసరమైనది. అట్టి పరిదర్శన మాడించిన, ప్రతీకార మొనర్చికొన ననువుపడునని దీర్ఘ దృష్టితో యోజించి, ప్రకాశవహునకు మంతనమును జెప్పుట కొక మేధావి కావలయును. అందువలననే కలహభోజనుఁడు, బుద్ధిబల సంపన్నుఁడు నగు నారదున కీకథయందుఁ బ్రవేశము గలిగినది. ప్రబల శత్రువృతప్ప సతీత్వమును గూలద్రోయుటకుఁ బూనుకొనఁడు. అట్టి శత్రుత్వము ప్రకాశవహునియందుఁ గల్పితమైనది. దానికి గ్లైన్యశిష్యు లకుఁ కథలో స్థాన మేర్పడినది. ఈరీతిగ సీతాయనమునందలి పాత్రలు కల్పనములు నన్యోన్య సహాయకారులై కథాపరిణామమునకుఁ దోడ్పడు నట్లుగఁ గల్పితములైనవి.

శతానందుఁడు తన భార్యయైన జనతిని తాటకగా శపించుట సీతాయనమందలి యహల్య కథలోని యొక విశేషము. ఈ కల్పనము పూర్వకథలకు భిన్నమైనది. రామాయణమున తాటక సుకేతుని కూఁతురు. జంభుని పుత్రుఁడైన సునందుని భార్య. తొలుత రూపవతి. వేయి యేనుగుల బలముగల యీమె యగస్త్యుని హింసింపఁ బూను కొనఁగా నతఁడు వికృతరూపమును బొందుమని శపించిన ట్లున్నది.

"భిన్నవృత్తమును, రచనాహేవాకమును, పాత్రౌచితి" గలిగిన యీ సీతాయనమందలి అహల్యకథ రసమయహృదయముగలవారి నాక ర్షించి యానందింపఁజేయు ననుటలో నాశ్చర్యములేదు. శ్రీదువ్వూరివా రన్నట్లుగ నీ కథావిభేదము. 'లోగడ రామాయణాంధ్రకర్తలు స్వతం త్రించి చేసిన మార్పులకన్న' రసికహృదయము నాకర్షించుటసత్యము. కాని యిది వాల్మీకిరామాయణమందలి దోషములు సవరించి యహల్య

కథను సంస్కరించిన దనుటమాత్ర మంగీకారయోగ్యమైన యభ్యూహము కాఁజాలదు. రామాయణమున నహల్యకథ ఋషిప్రోక్తము లేదా ఋషిప్రక్షిప్తము. "తెలియరానివి మనుజబుద్ధులకు దేవతారహస్యముల్ మునుల గాథాపథాలు." లౌకికదృష్టితోఁ బరిశీలించినను లోకమునఁ బ్రతీకారేచ్ఛగల వ్యక్తులు, సతీత్వభంజకములనియైన వెలువక యెంతటి దుష్కృత్యముల కెట్లు పాల్పడుదురో, జితేంద్రియులైనవారును సతియందలి దోషమును గన్న నెంతటి తీవ్రరూపమును ధరింతురో, అమాయికలగువారు తమ క్షేమమునైన భావింపక దుష్టుల కెట్లు లోఁబడుచుందురో యిందు సమంజసముగ నిరూపితమైనది.

సీతాయన మందలి కథలోని పాత్రలు 'మానవత్వమునకు సన్నిహితములు. వారి చిత్తవృత్తులు చేష్టలును మానవానుగుణములై యొప్పుచున్నవి. గౌతముఁ డహల్యకు వరమును బ్రసాదించుట, నారదుఁడు జనతికిఁ గోరిన రూపమును ధరించుశక్తి నిచ్చుటలు రెండును అహల్యశిలారూపమును బొందుటయు, శతానందుఁడు భార్య యగు జనతిని శపింప నామె యాతనికన్నుల యెదుట రాక్షసాంగన యగుట యనునవి రెండును నిందలి యభూతకల్పనలు. 'గౌతముని కోడలు జనతి, ఆమెతండ్రి ప్రకాశవహుఁడు నిందలి నూతనపాత్రలు'. వీరు పురాణ ప్రసిద్ధమైన యహల్యకథలోఁ గన్పింపరు. పురాణరామపతితపావనత్వనిరూపణాత్మక మైన యహల్యకథను మార్ప యత్నించుట వలన నెన్నెన్నియో కథాక్లేశములు సంభవించును. ప్రధానముగ గౌతమపాత్ర దెబ్బతినును.

"సీతాయనమందలి యహల్యాగాథ నాటి దేశకాలపరిస్థితులకు దారకాణాగా నున్నది. దండకారణ్యాది వనములందు ప్రకాశవహాదు లైన జనపతులు తమ ప్రాభవస్థాపనకై యొనర్చు యత్నములు, కులపతు లైన గౌతమాదుల నిర్మోహత్వము, గ్లేవ్యాది పతితజాతుల కష్టపరంపరలు నిందు నిరూపితములైనవి. ప్రధానముగ జనపదపాలకులును, ఋషిసత్తములును దమతమ శక్తిని బరీక్షించుకొను చున్నట్లును, తుద కార్షశక్తియే విజయమును జేకొనుచున్నట్లును నీగాథవలన వెల్లడియగుచున్నది.

# కల్పనలు - ప్రయోజనములు

సీతాయనమందలి అహల్యకథ పురాణప్రసిద్ధ మైన కథకు భిన్నమైనది. ఇందు ప్రకాశవహాగ్లేవ్యావైరము, నారదప్రకాశవహ సంభాషణము, కుహానామునిదంపతుల సంభాషణము, ఊర్వశీపురందర నాటికాప్రదర్శనము, గౌతమపశ్చాత్తాపము, జనతిశాపము లనునవి ప్రధానకల్పనలు.

అహల్యాశీలపోషణమునకై ఇంద్రసంపర్కమును దొలగించుట, శాపమునకై కారణముల వెదకుట సీతాయనకథాకర్త కవసరమైనది. గౌతముడు ధర్మపత్నియందు వ్యభిచారదోషమున్నగాని శపింపడు. కావున నింద్రసంబంధము కుహానారూపమునఁ బ్రదర్శింపవలసివచ్చినది. అట్టిదానికి కారకుఁడు పురాణకథయందు లేని ప్రకాశవహుఁడు. జనస్థానపాలకుఁడు అహల్యాగౌతములకుఁ బుత్రుఁడైన శతానందునకుఁ గుమార్తెయగు జనతి నిచ్చుటచే వియ్యంకుఁడు. ఇట్టి వియ్యంకుఁడు

గౌతమున కహల్యపైఁ గ్రోధమును గల్పించుటకుఁ దగిన కారణముండ వలయును. ఆకారణమే ప్రకాశ్రవహ గ్లేవ్యవైరము.

ప్రకాశ్రవహునకు గ్లేవ్యశిష్యులపై ద్వేషభావమును గల్పించి జనస్థానమువిూదుగా వారి నధ్యయన మొనర్చుకొన గౌతమాశ్రమము నకు రానీయకుండ జేసి కథాకర్త అహల్యను వారికష్టములఁ బాపఁ బ్రేరేపించినాఁడు. తత్ఫలితము ప్రకాశ్రవహుని జయించి యహల్యా దేశము నుద్గవ్యుల వశమొనర్చుట. ఈగ్లేవ్యశిష్య ప్రకాశవహ వైరకల్ప నమువలన నహల్యా ధర్మరక్షణాభిమానము, యుద్ధవీరము, నీతిజ్ఞత, శిష్యవాత్సల్యము మొదలైన యుత్తమగుణములు పరిదర్శితము లైనవి. గౌతమ వరదానముః నిందువలన సఫలీకృత మైనది.

పరాభవ మొందిన ప్రకాశ్రవహుఁ డూరకుండునా? అడవుల పాలైనను బ్రతీకారవాంఛ యతనిని బాధపెట్టుచున్నది. అతని ప్రతీ కారమును సాగించుటకే పురాణకథ. ఇందుకే నారదాగమనము, ప్రకాశవహ నారదసంభాషణములు గల్పితము లైనవి. వీరియుభయసంభా షణము భవిష్యత్కథ సాగుటకును, అహల్యాదేవి ధనుర్విద్యా నైపుణ్యమును బ్రదర్శించుటకును, దోడ్పడుచున్నవి.

కుహనాముని దంపతులసంభాషణమునకు ముందు తొలుకాఱున వర్షము వర్ణితమైనది. దీనిప్రయోజనము నిత్యకర్మముల దీర్చుకొన నదీ పథమున నేగు గౌతముని కుహనాముని వేషములధరించిన ప్రకాశ్ర వహుఁడు నతనిభార్యయు నివసించుచున్న కుటీరమునకుఁ జేర్చుట. కుహనాముని దంపతుల సంభాషణమునకు అహల్యాశీలమును గౌత

ముఁడు శంకించుటకై విషబీజముల నాటుటయే ప్రయోజనము. వారి సంభాషణను విన్న గౌతముఁడు 'ఏమి ? అహల్య-శచీపతి- ఏకశయ్య. యని యద్భుతపడి పలురీతుల తర్క-వితర్కము లొనర్చుచు ఖిన్న రూపుఁడై స్వాశ్రమమున కేఁగినాఁడు.

గౌతముఁ డహల్య కింద్రసంపర్కమునుగూర్చి విన్నాఁడు. ఇక కనవలసియున్నది. ఇంద్రుని రాక నతడు పరీక్షింపవలసియున్నది. కావున నతఁడు శతానందునకు రుగ్మత గల్గినట్లు వార్త వచ్చినదని యా రాత్రియంతయు నింద్రుని వెదకి వేసారి కుటీరమునకుఁ దిరిగి వచ్చినాఁడు. అప్పటికే జనతి దుష్టబుద్ధితో ఊర్వశీపురందరనాటికా ప్రదర్శనము పూర్తిగావించినది. అత్తగారి శీలమును మామ శంకించు నట్లొనర్చుటకు జనతి తోడ్పాటొసఁగుటకు 'పుట్టింటి పక్షపాతము, తల్లిదండ్రులభంగపాటును నోర్వజాలకపోవుట, కారణములుగఁ జెప్పఁ బడినవి. జనతి యచ్చముగ నింద్రునివలెఁ గన్పించుటకు నారదవరదా నము కారణముగఁ గల్పింపఁబడినది. ఊర్వశీపురందర నాటికాప్రదర్శ నమువలన ననుకొన్న ప్రయోజనము నెరవేరినది. గౌతముఁడు పూర్వ మహల్య శీలమునుగూర్చి కేవలము వినినవాఁ డిపుడు ప్రత్యక్షముగఁ జూచినాఁడు. గౌతమునివంటి జితేంద్రియుఁడు తన తపశ్చర్యకు ధార్మికజీవితమునకు నాటంకముల గల్పించు సన్నివేశములు వచ్చినపు డెట్లు చలించి క్రోధోన్మత్తుఁడగునో యిందుమూలమున నభివ్యక్త మొనర్పఁబడినది. అహల్య సాధుస్వభావమున కోడలు జనతిని శంకిం పక పుత్రికావాత్సల్యమున నెట్లుగ నామెపన్నాగమునఁ బడినదో యిట నిరూపితమైనది.

గౌతమపశ్చాత్తాపము తెలుపాతి కల్పనము. పురాణప్రసిద్ధ మైన కథయందు గౌతముఁడు జ్ఞానకృతదోషమో అజ్ఞానకృత దోషమో దోషయగు నహల్యకు శాపమిచ్చినాఁడు. శాపమిచ్చుటకుఁ బూర్వము యోగదృష్టిని బరికించి యట్టిశాపమున కామె పాత్రురా లనియే శపించినాఁడు. కాని సీతాయనకథయం దహల్య దోషరహిత. పరమసాధ్వి. పతిదేవత. అట్టియహల్యను దారుణముగ శిలారూపవు కమ్మని శపించుట యనవసరము. యోగదృష్టితోఁ దిలకించి సత్యమెఱిగి పశ్చాత్తాపము నొందుటయు ననవసరము. లేకున్న గౌతమపాత్ర దెబ్బ తినును. కావున సీతాయనకథయందు గౌతముఁడు యోగదృష్టితో సత్యమెఱిఁగిన పిమ్మట పశ్చాత్తాపము నొంది 'విజయము తనధర్మ పత్ని' దని యంగీకరించి ప్రతిశాపదగ్ధునివలె శిలారూప యైన యహల్యా సన్నిధానమున దారుభూతుఁడైనాఁడు. కథాభేదము వలన నిట్టి కల్పన మత్యావశ్యక మైనది. ఇట్టి పశ్చాత్తాపమే లేకున్న నతఁ డెంతటి అక్షపాదుఁడైనను, తపోధనుడైనను నతఁ డొనర్చిన కఠినకృత్యము నకు నిష్కృతి యుండెడిది కాదు.

సీతాయన మందలి తుదికథలోని కల్పనము శతానందుఁడు జనతి కిచ్చిన శాపము. ఈమెపాత్ర కథలో తండ్రియైన ప్రక్రావహుని పాపవ్యవసాయమునకు దోడ్పాటు నిచ్చుట. పాపులతోపా టిట్టి తోడ్పాటునిచ్చిన వారును శిక్షితులు కావలయును. ఇట పాపి ప్రక్రా వహునకుఁ గుమార్తె రాక్షసరూపమునొందుటయే శిక్ష. జనతి కామె యొనర్చిన దుష్కృత్యమునకు రక్కసిరూపము శిక్షగ నిచ్చినాఁడు గౌతముఁడు ఈశాపనమే లేకున్న చో సీకథ యుత్తమశీలాధిక్యమును

బోధింపఁగలిగెడిదిగాదు. గౌతమునశ్చాత్తాప, శతానంద కృతశాప ములవలన నీకావ్యము విశ్వశ్రేయమైనది.

నారదుడు జనతికి కామరూపము నిచ్చినాడు. ఇది లేకున్న నింద్రరూపమును బొంది గౌతముని భ్రమపెట్టుట కష్టము.

ఈరీతిగా సీతాయనమందలి కల్పనము లన్నియును మానవ ప్రకృతిచేష్టల కనుగుణములై పాత్రల శీలాదికములను బ్రదర్శించుచు కథానిర్వహణమునకుఁ బ్రయోజనకారులగుచు నొప్పినవి. ఈకల్పన లీయుపాఖ్యానకథను జగద్ధితకావ్య కథావస్తువును గల దానినిగా నొనర్చినవి.

---

## పాత్రలు - అహల్య

సీతాయనమందలి అహల్య పతివ్రతాశిరోమణి. ఇంద్రసంప ర్కములేని దోషరహిత. 'గౌతమధర్మపత్ని. దేవత్వము, ఆప్తత్వము నాకే యుపాధి నాశ్రయింపఁగా నెగడిన మాతృశ్రీ.' బ్రహ్మమానస పుత్రి. ధర్మాసక్త. వీరవనిత. సముదాచారజ్ఞ. సంభాషణాచతుర' దుష్టుల ప్రతీకారేచ్ఛవలన శాపోపహతయయ్యు 'విజయమునుగొన్న సాధ్వీమతల్లిక.

రూపవతి:— ఆమె బ్రహ్మమానసపుత్రి యగుటవలన నామె యుత్తమజన్మము వెల్లడియగుచున్నది. రూపవతి. ఆమె త్రిలోక సౌందర్యమున కద్భుతపడి శచీప్రియుఁడైన యింద్రుఁడు ఆమెను పరింపదలంచుట, విఫలుఁడై యీర్ష్యవహించి నాఁడా యని గౌతముఁ

మూహింపఁ దగినరీతిగా బ్రవర్తించుట (పుట 20 - పెండ్లినాఁటి యాసుతెలపింప దివస్పతి (ద్రోహచింతతో నుండెనో కో) యామె రూపాతిశయమును జెప్పక చెప్పుచున్నవి. జనతి 'ఊర్వశీ - పురందర" నాటిక యం దామెచే నూర్వశీభూమికను ధరింపఁజేయు సందర్భమున 'ఊర్వశికి వంకలం దిద్దుచున్న మీఁదు రూపురేకల భూమికాలోప మున్నె?' యని ప్రశంసించుట కృతిప్రమదంపతు లామెసౌందర్యము నాధారముగఁ గొని 'రూపవతి భార్య పరమశత్రు' వనెడు సామెతను జతయొనర్చి గౌతముని హృదయమున కోపబీజములు నాటుటయు నామె రూపసౌందర్యమునకు నిదర్శనములు.

పరమపతివ్రత :- గౌతముని వివాహమాడినదాదిగ నామె యతని యార్షజీవితపథమున సహచరియై, పతిసేవాతత్పరతతో నతని నైష్ఠికాచారములకుఁ దోడ్పాటు నిచ్చుచు, గార్హస్థ్యవిధులఁ దన యాత్మలత నాతనితోఁ బెనవైచి మనసార ప్రేమించి వ్యవహరించిన పుణ్యసాధ్వి అహల్య. భర్తయు నామె సహచర్యమునకు, ధర్మపత్నీత్వమునకు, గాఢానురాగమునకు సంతసిల్లి వరదాన మొనర్చుట యిందుకు నిదర్శనము. ముద్దుముచ్చటలకు ముదిమిఁదోడ్పడుటకు, క్రతుసిద్ధికి పితృతారకమునైన కన్యారత్నసంపద నాశించిన యామె కోర్కిమాత్రము, పాపము తీరనేలేదు. "నా గృహస్థత కిపుడు ధన్యత లభించె, పూర్ణసంతృప్తి నీవల్లఁ బొందినాఁడ" అని గౌతము డహల్యతోఁ బలికినపు డామె తన పాతివ్రత్యమునకుఁ దగిన ప్రతిఫలము లభించినదని యెంతయు సంతసించియుండును. ఇంతటి యుత్తమ పతివ్రత యగుటవలననే విభ్రాంతితో గౌతముఁడు జారిణి, పుంశ్చలి

యిత్యాదిగా నెంత నిందించినను, ఆమె భర్తను తూలనాడుటకుఁ గాని తిరస్కరించుటకుఁ గాని యత్నింపలేదు. శపించినపుడును "మీది విభ్రాంతి, జారిణీభావమా? అది యెన్నఁడైన నా యెదం దగిలెనా? శాపాగ్నిచే నన్ను దహింతురా? ఇది యన్యాయము. క్షమాశీలురై నిర్హేతుక క్రోధమును సంహరింపుఁ" డని వేఁడుకొన్నది. "ఏనునిర్దోష" నని మొఱవెట్టినది. "కర్కశతపశ్చరణా!" యని సంబోధించుటకంటెఁ గఠినమైనమాట నోట రానీయలేదు.

గర్వరహిత:— భర్త గౌతముఁడు తనగృహస్థజీవితసహచర్యమునకు సంతసించి యామెను విశేషముగఁ బ్రశంసించినపుడు అహల్య యించుకయైన గర్వమును బొందలేదు. వరమును గోరుమన్నప్పుడామె ప్రేమోల్బణతతో, స్తుతిని వినఁజాలనిదై "భార్య భర్తృపుణ్యమునఁ బాలు పంచుకొనునపుడు, కష్టములలో మాత్రము భాగస్వామిని గావలదా, నా సతీధర్మనిర్వహణమునుఁగూర్చి యింతగాఁ జెప్పవలసిన పని యేమియును లే' దనినది.

ప్రతిఫలవిరక్త:— అతినిష్ఠురవ్రతచర్యలతోఁ గూడిన యార్షజీవితమున సహచరియై వర్తించినందుల కామె కోరిన ప్రతిఫల మేమియును లేదు. ఆమెప్రణయమునకు ముగ్ధుఁడై గౌతముఁడు తానై వేఁడునుఁగా నహల్య "వరము కోరుటా? వరములు భీకరములు; మీ కృపావిలసనము లే నాకు గ్రైవేయహారావళు" లని పల్కినది. "పతిదేవత"యైన యామె యాతనికరుణాదృష్టిని తప్ప నన్య మేమియును గాంక్షింపదు.

ధర్మజ్ఞ, లోకహితబుద్ధి:— అహల్య భర్తయొసఁగిన వరమును లోకహితబుద్ధితో భక్తిభావమున మహాప్రసాదమట్లుగా గ్రహించినది.

లౌకికదృష్టితో నెన్నఁడును భర్త నైష్ఠికజీవితమున కాటంకములు గల్పింపరాదని యెఱిఁగిన పరమధర్మజ్ఞ యామె. వర్షవేళ గౌతముఁడు నది కేఁగదలఁచినపుడు తొలుత నామనవి విని కృత్యములింటఁ దీర్పుడని వేఁడినది. కాని యాతఁడు "నా నియమమును దప్పుదునా?" యని ప్రశ్నింప "గృహస్థమార్గమున నాడినమాటలుగాని యార్షపద్ధతికి మోసము దెత్తునె" యని ధర్మజ్ఞయై పలికినది.

ఆమె యార్షధర్మము నెఱుగుటయేగాక లోకధర్మము నెఱిఁగినది. లోకమున బ్రవర్తిల్లు నధర్మము నామె సహింపఁజాలని కరుణారస హృదయ. ఉద్గవ్యులు మనీషులయ్యు, వైదికులయ్యు, మాంసభుక్కులు. లోకముచే దుష్టులుగ భావింపఁబడువారు. అట్టి పతితులకు విద్యాంతరాయము (అధ్యయనాతంకము) కలుగుట యామె సహింపఁజాలక పోయినది. సుతనిర్విశేషులైన గ్లెవ్యశిష్యుల బాధల వారింప భర్త నెంతయు యుద్బోధించినది. 'మాకేల లోకమ్ముతో నీచిట్టంటులు?' 'ఈ సంసారబంధములు మా తల కెక్క' వని గౌతముఁడన్నపుడు,

"ధర్మమును నిల్పునట్టి బాధ్యతలు, పాల
కులకు నెంతటివో ప్రజావళికి నంతే,
ప్రజలు కారా మునుల్? హీన భావ మిందు
దగ్ధమౌచుండనా? యేటి ధర్మ మార్య?"

యని లోకహితకార్యనిర్వహణకై భర్త తన్నాజ్ఞాపింపఁజేసికొనినది.

వీరవనిత, కార్యదక్ష, నీతిజ్ఞ, యుద్ధవిశారద :— సర్వసామాన్యముగ మునిపత్నులయందుఁ గోచరింపని క్షాత్రవీర మహల్యయందు గోచరించుచున్నది. అన్యాయనివర్తనమున కామె సంసిద్ధయై భర్త

ప్రసాదించిన వరమును వజ్రకవచముగ నమ్మి, శత్రునాప్తబంధువైన ప్రకాశ్రవహుఁడని యైనఁ బరిగణింపక యతనితో యుద్ధసన్నద్ధయై యోడించి శిష్యవర్గమునకుఁ బాలకుని వశంవదు నొనర్చిన యామె వీర మనస్య సామాన్యము. ఇంతటి మహత్తర కార్యమును సాధించిన యామె కార్యదక్ష యనుటలో నతిశయము లేదు. తొలుత ప్రకాశ్ర వహునితో యుద్ధమొనర్ప కృతనిశ్చయ యయ్యును నామె సహజముగ శాంతిప్రియ యగుటచే వ్యవహారము సామమునఁ జక్కఁబడు నేమో యని దూతకృత్యమును నడిపినది. అది విఫలమైనపుడే యుద్ధమొనర్చినది గాని మున్ముందే తొందరపాటు నొందలేదు. ఈ యంశము లామె నీతిజ్ఞతను వెల్లడించుచున్నవి.

అహల్య యుద్ధవిశారద. ఆమె రణశక్తులు శత్రు దుర్భరములు. ప్రకాశ్రవహుఁడు నారదునితోఁ దన పరాజయ పరాభవములఁ గూర్చి నివేదించుకొను సందర్భమున "కయ్యపుఁ దియ్యపుంబస జగా మగవాఁ డనిపించుకొన్నది; శతాధికశూరులు తీసికట్టు లాతొయ్యలికన్న; ఆడుది కాదు నారద! మహాస్త్రవిశారద; పింజపింజగాఁ గాఁడఁగ నేయుశక్తికి బికాపికలయ్యెను సేనలెల్ల; ఆపస లత్యపూర్వముల్" అన్న వాక్యము లన్నియు నహల్య యుద్ధవీరతను బ్రశంసించుచున్నవి. పరమశత్రువుచే నిట్టి స్తుతి నందుకొన్న యహల్య వీరవనిత. రాజనీతిజ్ఞ, యుద్ధ తంత్రజ్ఞ. 'లోక హితమెంచి తలంచిన కర్జమందు నీదే యగుఁగాక దిగ్విజయ' మని తపోబలసంపన్నుఁడైన భర్తయిచ్చిన వరమును నమ్మి, అగ్రేసరయై యుద్ధభూమికి స్త్రైన్యశిష్యులతో నేఁగి విజయమును గొని ధర్మసంస్థాపన మొనర్చిన శూరురాలు.

శంకాశూన్యహృదయ :— పరిత్రాణవహుని జయించి రాజ్యమును గ్లేవ్యశిష్యుల కిచ్చుటతో సర్వమును దొలఁగిన దని యామె భావించినట్లు కన్పించును. ఇందుల కాత డరణ్యములఁ బట్టిపోవుట కారణమై యుండవచ్చును. వంగినకొలఁది ధనుస్సు బలీయమైనట్లు శత్రువు లొంగినకొలఁది బలవంతుఁ డను నీతి ననుసరించి జాగరూకత వహించినచో బాగుండెడిది. తన కుమార్తెమూలమున నేమైన పరిత్రాణవహుఁడు తనపైఁ బ్రతీకార మొనర్ప యత్నించు నని యూహించి యామె చేష్టల నించుక సంశయించుచుఁ దగు జాగరూకతతోఁ బ్రవర్తించినచో నహల్య శాపోపహతికిఁ బాలయ్యెడిది కాదేమో !

మాతృహృదయ:— అహల్య యతిశయ మైన వాత్సల్యముగల తల్లి. ఈమె యపార వత్సలత్వమే యుద్గవ్య శిష్యుల క్లేశములం దీర్చుట కామెను బురికొల్పినది. శతానందునికి యనారోగ్యమును విన్నపు డామె నది పరితపింపఁ జేసినది. జనతి కోర్కెను దీర్చుట కామెచే నూర్వశీపాత్రధారణమున కొప్పించినది. సర్వవిధముల దోష రహితనుగాఁ దీర్చిన సీతాయనకర్త యీామెచే దేవవేశ్య యగు నూర్వశీభూమికను ధరింపఁజేసి యభినయవేళ భావమాత్రముగ నైన పరపురుషాసక్తను గావించుట లోపమని చెప్పక తప్పదు.

## గౌతముఁడు

'గౌతముఁ డేనాఁటివాఁడో. అద్వితీయ మైన తపశ్శక్తి సంపాదించి, సప్తమహర్షులలో స్థానమును గడించుకొన్న మహనీయుఁడు.

ఋషిసత్తముఁడు. జితకాశి (ఇంద్రియవిజయమును గొన్నవాఁడు) నాస్తికదుష్టవాదముల ఖండించి న్యాయశాస్త్రమును సంధానమొనర్చిన మహావిజ్ఞాని. పాదమున జ్ఞానచక్షువును ధరించి 'అక్షపాదుఁ'డని విఖ్యాతి గన్న మేటి. తనతపశ్శక్తిచే గౌతమిని భూలోకమునకు గొనివచ్చి లోకు లైహికాముష్మిక సుఖము లనుభవింపఁ దోడ్పడినఁ లోకోపకారి.

బ్రహ్మమానసపుత్రియు, రూపవతియు నైన అహల్యను వివాహమాడి యితఁడు ధార్మిక దాంపత్యసౌఖ్యములతో గృహస్థాశ్రమధర్మముల నిర్వర్తించినాఁడు. పత్నీదత్తసౌఖ్యమునకు మురిసి ధర్మపత్ని యగు నామె భక్తిప్రపూర్ణ హృదయపద్మమందుఁ దుమ్మెదయై గాఢానురాగ మనుభవించినాఁడు. అతఁడు కోరుకొని నట్లే గౌతమునకుఁ దనప్రియపత్నివలన పున్నామనరకమునుండి యుద్ధరింపఁగలవాఁడును, ఊర్ధ్వదైహికక్రియ లొనర్ప సమర్థుఁడును నగు పుత్రుఁడు జన్మించినాఁడు. అతనికిఁ దండ్రియాశయమే యగుటయు, పండితపుత్రుఁడు గాక యతఁడు పైతృకతపఃప్రభావసంపత్తిని గోరి నైష్ఠికుఁ డగుటయు గౌతముని యదృష్టమును, పెంపకపుతీరును వెల్లడించుచున్నవి. అట్టి పుత్రసంతానమువలనను, అహల్యవంటి యనుకూలవతి యైన ధర్మపత్నిసాహచర్యమువలనను గౌతముఁడు గృహస్థజీవితమున మహానందానుభూతి నొందినాఁ డనుట నిస్సంశయము.

గౌతముఁడు యుగయుగార్జిత తపోధనుఁడు. అడుగడుగు గండమగు తన యూర్ధ్వజీవిత యాత్రను దనసహచర్యముచే సుఖతర మొనర్చిన ధర్మపత్నికి వరదానమునను సంసిద్ధుఁడై వల దన్న ననుగ్రహిం

చుట యాతని కోమలహృదయమునకు, కృతజ్ఞతాబుద్ధికి, ధర్మజ్ఞతకు, దాంపత్యప్రేమకు చక్కని నిదర్శనము.

తనసంతతి మహానీయుఁ డిచ్చు వరము సామాన్య మైనదిగను, తాకికదృష్టితో నిచ్చునదిగ నుండరాదు. 'లోకహితమంచి తలం చిన కర్జమందు నీదే యగుగాక దిగ్విజయ' మని యాచిత్య మెఱిఁగి యతఁడు వరమిచ్చినాఁడు. ఇట్టి వరప్రదాన మతని యాత్మవిశ్వాస మును వెల్లడించుచున్నది.

గౌతముఁడు పరమనైష్ఠికుఁడు. ఆర్షధర్మ నిర్వహణమునం దత్యాసక్తి గల యాతఁడు పాంచభౌతికములైన యెట్టియాటంకముల నైన లెక్కగొనక తన నియమపాలనమునందు శ్రద్ధవహించును. తొలికాఱున వర్షము పడునపుఁ డహల్య నది కేఁగక యింటనే 'నిత్య కర్మలఁ దీర్పుఁడని వేడినను లెక్కింపక 'నియమమును దప్పఁబో' ననియు, చీకఁటి గీకఁటి బగటు చినుకులు గినుకలు గాలి గీలి యాగా కవి లెక్కయే పడతుఁకా! నీకనుచూపు వెన్నెలలనే పచరింపుము నాదు బాట' అనియుఁ జమత్కారముగఁబల్కి నదీపథమున నేఁగుట యతని ధర్మనిరతిని, శ్రద్ధను, జితేంద్రియత్వమును, నిర్భయత్వమును దెలుపుచున్నది.

కుహానాదంపతులసంభాషణమును వినుట యిట్టి నైష్ఠికప్రవృ త్తికి భంజకమైనది. అతఁ డాశ్చర్య చకితుఁ డైనాఁడు. అప్రయత్న ముగ నతని నోటివెంట 'ఏమి - అహల్య - శచీపతి - ఏకశయ్య' యను నాశ్చర్యద్యోతక శబ్దములు వెలువడినవి. మనసున నేమేమో యూహ లారంభమైనవి. వివాహము నాఁటి యింద్రుని యీర్ష్య

ముందు స్మరణకు వచ్చినది. పిమ్మట నహల్యను శంకించినాఁడు. కీర్తిప్రతిష్ఠలు భగ్నమైన వనుభావమున ద్వేషముతో తర్కవితర్కము లొనర్చి, పర్ణశాలకు వచ్చి తీవ్రవేదనకు గుఱియైనాఁడు. ఇట్టి హృదయకల్లోల మంతయు నాతని తపోవృత్తికి భంగము కలిగిన దనెడి తీవ్రోద్వేగమువలనఁ గలిగినదే. ధ్వను లర్థాపత్తులతోఁ గూడిన వాక్యముల నహల్యతో సంభాషించి నాఁడే గాని వెను వెంటనే చర్యఁ గైకొనకుండుట ప్రత్యక్షనిదర్శనము లేకపోవుట వలననే.

నాటికా ప్రదర్శనానంతర మేకశయ్యపై నిదురించు చున్న కృత్రిమేంద్రాహల్యలఁ దిలకించి నపుడు తన సంశయము విచ్ఛేద మగుటచేఁ గ్రోధోన్మత్తుఁడై అహల్యను నింద్రుని దూఱినాఁడు. 'ఇది నాకర్మము దాని నన్న ఫలమేమీ! దాని ప్రారబ్ధ మావిధి నీడ్చె' ననుకొని దూషితయగు అహల్య వచ్చి పవిత్రుఁడగు తన్ను స్పృశింపఁగా నుగ్రమూర్తియై శిలారూపవుఁ గమ్మని శపించినాఁడు. అంతటి జితేంద్రియున కింతటి క్రోధోద్వేగము లెట్లు కలిగినవనుటకు 'అది లౌకికక్రోధము కాదు. నిత్యానందమయమై, సంతతధ్యానమున తత్త్వానుసంధానమొనర్చుచున్న తన ధార్మికజీవితమున కాటంకము గలుగుటచే వచ్చిన ధర్మక్రోధమని సమాధానము. పరమశాంతునకుఁ గలుగు కోపము మహాదారుణమగుట లోకప్రసిద్ధమేకదా!

శిలారూపమును బొందుచున్న యహల్యను జూచుచున్న గౌతముడు సహజకోమలుఁ డగుటచేఁ దన కర్కశత్వమును బోఁగొట్టుకొని సత్య మెఱిఁగి పశ్చాత్తప్తుఁ డగుచున్న యీతని భావింప హృదయము ద్రవింపక మానదు. ఎట్టి కౌటిల్యము లేనివాఁడగుటవలనఁ గంతము

పటుకును శిలయైన ధర్మపత్నితోఁ దన తప్పిదమును నివేదించి శాపాంత మును జెప్పినాఁడు. ప్రతిశాపదగ్ధునివలె ధర్మపత్ని సన్నిధానమున జడత్వము వహించి నివసించినాఁడు. గౌతమునివలె తప్పిదము తన దైనను 'నా కెంతటి మోహమైనది. మూఢబుద్ధినైతిని, జయమునీది. అపజయము నాది' యని కల్మషరహితహృదయముతో సంగీకరించు సుస్వభావు లెందరుందురు? ఈ సందర్భమున కవి గౌతముని చేష్టను సందర్భోచితముగ 'ఆశనిపాతమునకు నమృతవృష్టికిఁ గూడ వలఁతు లగుట పశులు వారిదములు' అని పలికించుట మెచ్చఁదగినది.

V. సోమరాజులు M. A.
లెక్చరరు — గుంటూరు కాలేజి.

---

# పీఠిక

అహల్యామాత బ్రహ్మమానసపుత్త్రి. గౌతమమహర్షి ధర్మపత్ని. దేవత్వము, అర్షతత్వము నొకేయుపాధినాశ్రయింపగా నెగడిన మాతృశ్రీ యామె. సురజ్యేష్ఠునికడనుండి వెలసినయీ సాధ్వీగాథ యీనాఁటివఱకు మానవలోకమున శిలాక్షరమైనది. పతివ్రతామతల్లులలో నగ్రస్థానమిచ్చి లోక మామెను పూజించినది. కోట్లకొలఁదితరములవా రామెను స్మరించి తరించినారు.

గౌతముఁ డేనాఁటివాఁడో ! అద్వితీయమైన తపశ్శక్తి సంపాదించి, సప్తమహర్షులలో స్థానము గడించుకొన్నాఁడు. గౌతమోపాధిలోని యాధ్యాత్మికశక్తి దేశక్షేమమునకు, సంఘభద్రతకు నయుతవర్షప్రణాలిక లానాఁడే సిద్ధపఱచిపెట్టినది. అహల్యాగౌతములు పుణ్యదంపతులు. సతీత్వములోను, సమానమందునుగూడ నహల్యదే ముందంజ. వీరిరువురును పురాణపాత్రలుకాక, యహల్య కొండభూమిగాను, గౌతముఁడుగోదావరిగాను, ఈ నదిచే నాభూమి తడుపఁబడుచుండుటనే యీగాథ సూచించు ననియు, నిది వసుచరిత్రకథవంటిదనియు నేఁటి రాసాయనికవేత్తల భావన. ఏమైనను నుత్తమాదర్శము లందించుటకు వీరు వ్యక్తులైరి. ఈ పుణ్యశ్లోకులకథ పూర్వగ్రంథములలోఁ బెక్కుదారులు త్రొక్కినది.

అహల్యనుగుఱించి మానవత్వముతో మన మెంచుకొను ముఖ్యప్రశ్నలు మూఁడు. ఆమె యతిచారదోషముచేసినా

లేనా— చేసియేయున్న చో నది తెలిసి చేసెనా, తెలియక చేసెనా—యనునది. రెండవది యింద్రాహల్యలలోఁ ద ప్పెవ రిది? మూఁడవది గౌతముఁ డామె నేమనిశపించెను? మున్నగు ప్రశ్నలకుఁ బురాణములలో భిన్నపద్ధతు లున్నవి. విభిన్నత కథ యొక్క ప్రాఁతదనమునకు సూచకము. కావుననే "కల్పభేదా త్కథా భేదః" యని మహాత్ములే యనినారు.

వాల్మీకిరామాయణమున—

మునివేషం సహస్రాక్షం విజ్ఞాయ రఘునందన
మతిం చకార దుర్మేధా దేవరాజకుతూహలాత్.

ఇందు మునివేషములోని యింద్రు నెఱిఁగియే యహల్య ప్రవర్తించినటు లున్నది. దేవరా జనెడికుతూహలముకూడ దానికిఁ దోడైనది. అంతతోఁ బోక "కృతార్థాస్మిసురశ్రేష్ఠ" అని యునన్నది. ఆదికవిదృష్టిలో నీయహల్య యిట దుష్టబుద్ధికదా. ఇందలి శాపము—

ఇహ వర్షసహస్రాణి బహూని త్వం నివత్స్యసి
వాయుభక్షా నిరాహారా తప్యన్తీ భస్మశాయినీ
అదృశ్యా సర్వభూతానాం ఆశ్రమేస్మిన్ నివత్స్యసి.

"వేలకొలఁదియేండ్లుగా నీవు గాలినే పీల్చుకొనుచు ఇత రాహారములు లేక బూదిలోఁబరుండి, ప్రాణులదృష్టిని బడక, తపించుచు నాయాశ్రమమం దుండుము" అని. రామునికి విశ్వామిత్రుఁ డహల్యనుజూపి "తారయైనాం మహాభాగా మహాల్యాం దేవరూపిణీం"యనియుఁ జెప్పుటచే ఆరూపముగా

శాప మిందు లేదు. శాపాంతమున స్త్రీరూప మందిన వెనుక "రాఘవౌతు తతస్తస్యాః పాదౌజగృహతు స్తదా" అనియు నవతారమూర్తుల నమస్సుల నీమె యందఁగలిగెను. తనపతి శాఁ డని తెలిసి దేవరాజకుతూహలముతోఁ బ్రవర్తించిన దుర్బుద్ధిగల యహల్యపాదములు రాఘవులు స్పృశించుట తద్వ్యక్తిపవిత్రతను సూచించుచున్నది.

అధ్యాత్మరామాయణమున—ఇం దహల్య పతిరూపములో నున్నయిందురిని గ్రహింపనే లేదు. పతియనియే యామె భావన. ఆదృష్టిలో నామె నెట్టిపాపము నంటియేయుండదు. ఇందలి శాపము—

"దుష్టేత్వం తిష్ఠ దుర్వృత్తే శిలాయా మాశ్రమే మమ
నిరాహారా దివారాత్రిం తపః పరమమాస్థితా
ఆతపానిలవర్షాది సహిష్ణుః పరమేశ్వరం
ధ్యాయన్తీ రామ మేకాగ్రమనసా........."

తా॥ నాయాశ్రమభూమిలో నొకచరియమీఁద నీ వుండవలసినదని కలదు.

శాపమోక్షమునందు—

"యదా త్వదాశ్రియశిలాం పాదాభ్యా మాక్రమిష్యతి
తదైవ ధూతపాపా త్వం............
తదా ద్యహల్యా భూతానా మదృశ్యా."

అనుటచే నాశ్రమశిలయందు భూతాదృశ్యత్వముతో రామజపము చేయుచు నుండుటయే యిందలి శాపము. రామ

లక్ష్మణుల కహల్యనుజూపుచు విశ్వామిత్రుడు "దర్శయామాస చాహల్యాముగ్రేణతపసాన్వితాం" అనుటచే నామె చైతన్యము కలదై తదాశ్రమశిలయందుండుటయే యిందు గౌతమశాపము.

పద్మపురాణమున—ఇందు వివాహమునాటికోపము తనహృదయము వేధింప నాటినుండియు నహల్య ననుభవింప వలెనని దేవరాజు ప్రయత్నించుచు, "కింవా కరోమ్యహం" అను నాలోచనలతో "గౌతమాధ్యాపనం గతః, తదా గౌతమ రూపేణ రేమే" అనియున్నది. గౌతమునికడకు విద్యాభ్యాసమున కేగుట, గౌతమరూపమున నామెను బొందుటయు జరిగినది. అహల్యమాత్రము శపింప నున్నపతితో "అజ్ఞానాత్ యత్కృతం కర్మ క్షంతుమర్హసి వై ప్రభో" నాతప్పు అజ్ఞానకృతమగుటచే క్షమింపవలెనన్నది. ఏమైనను శాపము తప్పదన్నాడు గౌతముడు. "పరేణాభిగతాసి త్వం అమేధ్యా పాపచారిణీ" అనియు పాప మామెను నిందించినాడు.

ఇందలి శాపము—

"అస్థిచర్మసమావిష్టా నిర్మాంసా నఖవర్జితా
చిరం స్థాస్యసి చైకాపి త్వాం పశ్యంతు జనాః స్త్రియః"

ఎముకలతోడను, చర్మముతోడను మిగిలి, మాంసమును గోళ్లును లేనిదాననై నలుగురును నిన్నుఁ జూచుచుండఁగా చిర కాలము నీవుండిపొమ్ము, అని. ఇందు మఱొకవిశేషము. వసిష్ఠుడు రామునకీగాధ చెప్పుచున్నాడు. కథవినిరామచంద్రుడు "అస్యా దోషో నచైవాస్తి దోషోయం పాకశాసనే" అనియుఁ

జెప్పియున్నాఁడు. కాన నహల్యామాతపవిత్రత భంగింపబఁడ లేదు.

బ్రహ్మపురాణమున—ఇందును దేవరాజని గ్రహించియే యహల్య తప్పుపనికి సిద్ధపడిన ట్లున్నది.
ఇందలి శాపము—

"తా మప్యాహ మునిః కోపాత్ త్వంచ శుష్కనదీభవ
యదాతు సంగతా భద్రే గౌతమీం పాపనాశినీం
నదీభూత్వా, పునారూపం ప్రాప్స్యసే ప్రియకృన్మమ".

నీ వొకయెండిపోయిననదివి కమ్ము. గౌతమీనదితో నీ వెప్పుడు కలసెదవో యప్పుడు నీకు శాపమోక్షము, స్వస్వరూపమును కలుగు నని యున్నది.

సత్యోపాఖ్యానము—అనఁగా నయోధ్యాగాథ. ఇదియు వాల్మీకికృత మనియు, నతఁడు మార్కండేయులకొ అకుఁ జెప్పినట్టులును నున్నది. ఇందు జ్ఞానాజ్ఞానకృతవిషయము తేలనే లేదు. శిలారూపశాపమే యిందుఁ గలదు.

ఆనందరామాయణమున—ఇదియు వాల్మీకికృత మనియే గలదు. "మునిరూపమహేంద్రేణ భుక్తాం రహసి...... భర్త్రాశప్తాం శిలాం మునిః" అని కలదు. కాన, దీనను నజ్ఞానకృత మనియే నిర్ణయము. శిలాకృతిగనే శాపము. కాని "నదీరూపా జనస్థానే హ్యహల్యా మునిశాపతః. కల్ప భేదా త్కథా భేదః" అనియు నిందుఁ గలదు.

బృహదారణ్యకమున—ఈగాధను సూచించు నొక వాక్యము "అహల్యాయై జార!" యని యున్నది. ఇది యింద్ర సంబోధనము. ఆపిలుపు మఘవున కమితప్రీతికరము. దీనిని భట్ట భాస్కరుఁడు వ్యాఖ్యానించుచు,

ఆ=సమంతాత్, హల్యతే=లిఖ్యత ఇతి, అహల్యా=వాక్. తస్యాః, జారకః=ప్రేరకః, అనఁగా వాక్కునకుఁ బ్రేరకుఁడు.

అహల్యా=వాక్. తస్యాః జరయితా, గుణానాం ఆనంత్యాత్, వైదికస్తుతిరూపా వాక్ త్వయి జీర్యతే. అనఁగా వైదిక రూప మగువాక్కు నీగుణానంత్యముచే నిన్ను స్తుతింప నసమర్థ యగుచున్నది.

జరయతేః=స్తుతికర్మణః, వాక్కుచే స్తుతింపఁదగినవాఁడా. అనియు ముమ్మాటికి వ్రాసినాఁడు. నాల్గవయర్థమున నహల్యా జారతను పురాణప్రసిద్ధమాత్రముగా సూచించి విడిచినాఁడు.

విచిత్రరామాయణమున—ఇది ఆంధ్రభాషలోనున్నది. దీనిలోని యహల్యకథ దీనినామమును సార్థకపఱచుచున్నది. ఆ కథ యిం దుదహరించుట మిక్కిలి హేయము. దీనికి మూల మేదియో చింత్యము. పూర్వగాథాలహరిలో నీకథయుఁ బ్రమాణముగా గ్రహింపఁబడినది.

ఇట్లీయహల్యకథ వివిధముగ నున్నది. అందుచే నా కథయు నొకప్రభేద మగుటలో నబ్బురము లేదు. 'రామబ్రహ్మానందము' అను నొకపండితుఁడు నేపాళ దేశమునుండి సంపాదించిన "సీతాయనము" అను నొకపాళీభాషా రామాయణగాథనుండి

యీ యహల్యగాథ సముద్ధృతమైనది. యిం దహల్యాశీలము చక్కఁగాఁ గాపాడబడినది. ఇందుగల కహల్యాసంపర్కమిందు లేనేలేదు. గౌతమునికోడలు జనని, పరిశ్రీవహుఁడుమున్నగు వారు నూతనపాత్రలు. ఇవి మానవత్వమునకు సన్నిహిత ములు. శతానందుఁడు తనభార్యను తాటకగాశపించుటయిందలి విశేషము. ఈ గాథ నాఁటిదేశకాలపరిస్థితులకుఁ దారకాణగా నున్నది. మిగిలిన విశేషములు నాపీఠికలో సూచితములు.

మఱియు నీకావ్యమున నొకేపద్యమున నిరువురుభాషించుట కొద్దితావులందుమాత్రమేకలదు. సంస్కృతమర్యాద తెలుగులోనికిఁ దేవలెనని యట్లువ్రాసితిని. అట్టిపట్టుల (:—) కోలన్ డేష్ గుర్తునుంచితిని. పఠిత లీగుర్తు గ్రహించి ప్రకరణ పాత్రలనుబట్టి ప్రసంగము లెవరివో గ్రహింతురుగాక. అచ్చ టచ్చట నతుకులు కలుపునట్టి ''అతఁ డిట్లనియె-తదనంతరమున" వంటివి పఠిత లూహించుకొనవలెను. లోగడరామాయణాంధ్రీ కర్తలు స్వతంత్రించి చేసినమార్పులకన్న నీకథావిధాన మెక్కు వగ నాహృదయము నాకర్షించుటచే దీనిని ఖండకావ్యముగ వ్రాసితిని. ఇందలి ధ్వనిరసభావాదికావ్యప్రధానగుణము లెంత వఱకు రాఁగలిగినవో, తత్తద్విశేషములు సహృదయులకే విడిచితిని. తెలిసినంతలో వ్యాకృతివిరుద్ధము లిందుఁ జొఱనీయ లేదు. పఠితలు కావ్యమందలి గుణములను గ్రహించి లోపము లను మన్నింపఁ బ్రార్థనలు.

ఈ కావ్యముపూర్తియగుటతోడనే కాకినాడ ఆంధ్ర సాహిత్యపరిషత్తువారు పండితసభ గావించి, చదువఁజేసి

నన్ను నా కావ్యమును గౌరవించిరి. ఈ సందర్భమున బరిష త్కార్యదర్శులు శ్రీ ప్రతివాదిభయంకర పార్థసారధి, అడ్వొ కేటుగారు పరిషత్తుపక్షమున నర్థనూటపదా ర్లొసంగుటయు, శ్రీ గరిమెళ్ళ వీరరాఘవులుగారు ప్రథమ ముద్రణావ్యయము నొసంగుటకు సభాముఖమున బాసచేసి వెంటనే రు. 116 ల నిచ్చుటయు, నాయుత్సాహమును రెట్టించినవి. ఈ యుభయు లకును నాహృదయపూర్వక ధన్యవాదములు.

ఈ కావ్యమును ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు 1953 బి. ఏ. పట్టభద్రులకు పాఠ్యముగా నిర్ణయించి నాకృషికి దోహదమొనరించినందులకు వారికి నాపరశ్శత నమస్సులు. దీనిని తమమామగారిపేరు చిరస్థాయిగా నుండగలందులకై వారికి కృతిగచేయుమని కోరిన శ్రీ శ్రీ తుర్లపాటి వెంకటచలం పంతులుగారికిని దానికి సహకరించిన వారిధర్మపత్ని లక్ష్మీనరస మాంబకును, ఈ కృషికి బీజావాపమొనర్చిన వారిపుత్రి సౌభాగ్యవతి కావలి శేషశాయికిని నాకృతజ్ఞతాభివంద నా శీర్వచనములు.

ఇట్లు,
గ్రంథకర్త.

---

# విజ్ఞప్తి

"జననీ ! నీవు పతివ్రతామణివి, నీసౌశీల్య మిల్లాండ్ర కె
ల్లను మేల్బంతి" మహర్షి గౌతమునివాల్లభ్యంపుసత్పత్ని ! ని
న్ననుమానింపఁగఁ జేసె నాదికవి మాతా! నీచరిత్రమ్మునం
దనుకోరాని భరింపరాని వెటు లమ్మా! గంట మెట్లీడ్చెనో ?

లేదం చాడఁగశక్తి యెవ్వారికి తల్లీ! దివ్యదృష్టి న్మహా
మేధావుల్ మును లెన్న, దానఁ గలుషంబే? అందునున్ సాధుసం
వాదప్రోజ్జ్వల మాదికావ్యమున లోపంబా ? కనుల్ పోవె ప
ల్కాఁదన్ ? ప్రాకృతదృష్టిఁ జూడ నగునొకో- ఆర్షతత్త్వార్థముల్ ?

శోకము శ్లోకరూపముగఁ జూకురునడ్డదయామయుండు వా
ల్మీకికులయంతవాఁడు నిను మేరలుమీఱిన తన్వినాఁగ బల్
సాకిరివై వెలార్చి యతిచారము నీయది వెల్లడింపఁగాఁ
గైకొనె; నింక నెవ్వ రది కాదనువారు? సతీమతల్లికా!

ఇవి నాగుండెలఁ బీటవెట్టుకొని యెన్నే నేండ్లుగా నిల్చియు
న్నవి శంకల్; మనమందు గ్రుచ్చెడిని చింతాశల్యమున్, వానినిన్
సవిమర్శంబుగ నాడఁబూనితిని కాంతారత్నమా! యిద్ది నా
యవివేక మ్మనుకోకు, సందియములమ్మా తల్లి! ముమ్మాటికిన్.

కాముకవృత్తి వాసవుఁడు గౌతమభామికి పూని రాఁగ నీ
వేమఱికే తదీయవిధ మెంచుచుఁ జీకటితప్పు చేయఁగా
భామిని! సాహసించి తని భావన చేయుటలో నిజమ్ము మా
కేమియు గోచరింపక డహించును మానస మోసతీమణీ!

ధర్మవాక్కుల నర్థానుధావనమ్ము
ప్రతిపదస్రవదమృతసంపదలు, యోగ
దృష్టులం బావనతయును దేజరిల్లు
నా వనౌకసుఁ డేల ని న్నాడె నటులు ?

కానీ నీకు సతీమతల్లుల మహాగ్రస్థాన మందిచ్చుచున్
దానై లోకము ప్రాకటంబుగను నిందల్ నెట్టి జేపెట్టినన్
న్యూనత్వంబు చరిత్రలోని దెటుమాయున్ హంత? నిన్నేల యా
మౌనీంద్రుం డటుగా సృజించెనొ గదమ్మా తల్లి! వాక్రువ్వవే.

నీ యసమానరూపమును నీ వినయాదికసద్గుణంబులున్
బాయనిమచ్చ తెచ్చుట కుపాయన మయ్యెనె? రూప మున్న యా
తోయజగంధులెల్లరు నధోగతిపాలొనరింతురే పతిన్
హేయపరాంగసంగతి నహీనసతీత్వము మంటఁ గల్పుచున్.

ఆకృతి సమస్తగుణముల కాకర మ్మ
టందురు; పెడదార్లు ద్రొక్కుట కౌనె రూపు ?
బ్రహ్మమానసపుత్రివై పతిని డాఁగు
రింతువే కట్ట ? యిది వెక్కిరింత కాక !

జాతివైరము ఘోరహింసాప్రసక్తి
కూరతయు వీఁగి మానిశక్తులకు లోఁగి
ఘాతుకమృగాళి గోగణక్రమత మసల ;
జనని ! నీకిట్టిక్రౌర్యంపుఁజర్య లెట్లొ?

గడ్డము మీసలుం బరమకర్మరవృత్తి తపోనురక్తి ము
జ్జడ్డగునిత్యజీవనము చీకిలిమాకిలివల్కలంబులున్
సొడ్డుగ నేవగించి విరసుండని మాని; మహేంద్రుపైని క
న్నొడ్డిన వన్నెలాడివఁ టయో యిటు భావనచేయ ధర్మవే?

నీజని నీయనుశ్రుతము నీ పతిభక్తి గుణానురక్తి నీ
నైజము నెంచఁబోవక జనం బటు లాడిన నాఁడుగాక ని
ర్వ్యాజత, నగ్గికిం జెదలు వట్టునె ? యేసతి నెప్డు డేజనుల్
పూజ లొనర్చి మెచ్చి ? రటు పోలదె నీకుఁ బతివ్రతామణీ !

మానివతంసకౌశికునిమన్నన లందుట, రామచంద్రుఁడున్
సానుజుఁడై భవత్పదము లంటి ప్రశంస లొనర్చి మ్రొక్కుట
న్మ్యానత పశ్చాత్భావ వగు టోపతిదేవత ! యిట్టి వట్టిపా
పానికిఁ బూను నీకెటులు భావ్యము లౌనొ యనుగ్రహింపుమా!

పాయనిదీక్షతోఁ బరమపావనరామకథాప్రపంచమున్
దీయని తెన్గుతో ననువదించినయిప్పటి మేటిసత్కవుల్
నీ యపరాధగాథకుఁ జలించియె కానలె మార్చినారు, త
ల్లీ ! యది కొంతకొంత తరలించె భవత్కథలోని లోపముల్.

ఎఱిఁగియు నే మెఱుంగకయు నీవు పురందరుతోడఁ జల్లఁగాఁ
దిరిగితి వంచుఁ గావ్యములు దెల్పెను; పద్ధతులందు రెంట నిన్
గరఁచె విభిన్నశాపము లెగంబడి సూటిగ; భర్తృదృష్టితోఁ
బరఁగిననాఁడు శాపపరిభావము నీకెటు లోసతీమణీ!

పరమనాస్తికదుష్టవాదముల్ ఖండింప
న్యాయశాస్త్రమును సంధానపఱచె
ఐహికాముష్మికా లందిచ్చి లోకులఁ
దరియింపఁజేయ గౌతమిని దెచ్చె
సప్తర్షిమండలాస్థానచక్రము నంటి
దేదీప్యమానసుస్థితి వహించె
జ్ఞానచక్షుస్సు నంజను సంఘటించి తా
నక్షపాదత్వవిఖ్యాతి వడసె;

అతఁడు జితకాశి సామాన్యుఁడా? ప్రగాఢ
యుగయుగార్జితసుతపోమహోగ్రమూర్తి
గౌతముం డామహర్షిశేఖరుని ధర్మ
పత్ని వగునీకు నింద్రుఁ డేపాటివాఁడో?

అతఁడు శతాశ్వమేధియు, బృహస్పతిశిష్యుఁడు, దేవరాజు, ది
క్పతియు, శచీపతిత్వవరభాగుఁడు, వజ్రియు, జిష్ణుఁ డెంచులోఁ
గుతికిలబడ్డవాఁ డతఁడు? కోడిగ మింతగఁ జేయనేల నిం
దితమతివై? పతివ్రతల తేఁకువ లార్చుట వృద్ధిహేతువే?

ఇట్టి తా నాకభోగదేవేంద్రుఁ డగుచు
బడుగుబాపనకాంతకై బడలువడుట
అక్కడ నజాండుఁడై సహస్రాక్షుఁ డగుట
అకట వికటమ్ముగాఁ దోఁచు నమ్మ మాకు.

నాకవేశ్యాభుజంగుఁడై నాఁడునాఁట
విసువు చెందఁడె సౌందర్యరసపిపాసఁ ?
గామధేనువుతోఁ గల్పకమ్ము లెసఁగ
వాంఛ లడుగంటవో మరుత్వంతునకును ?

మునులు మహాతపోధను లమోఘసువాక్ఛరు లా ఱెఱుంగఁడో,
మునుకొని కొంపఁ గూల్ప మునిముచ్చుగ వచ్చుట లొచ్చుగాదొ, భీ
తిని నఱచేతఁ బ్రాణము కదించి సుఖించు టదెంతపాటి శ
క్రున, కివి కాముకుల్ తెలియరో? తలమున్క లనంగరంగముల్.

దాయంపుంబిలు పౌటగా కిది ముదర్థం బానొకో "హే అహ
ల్యాయై జార" అటంచుఁ బిల్చిన మహాహ్లాదం బ టాయయ్యకుఁ
హేయార్థప్రతిపాదకం బగుడు న ట్లే లా సునాసీరుఁ డా
మ్నాయార్థమ్ముల లోఁతు లెవ్వఁడు గ్రహింపంజాలువాఁ డమ్మరో !

హాలముఖకర్మ మందని డహల్య, మరుక్షితి; తాఁ బ్రవష్టుఁడై
బలయుట దాని, జారపదభావముగా బుధు లాడినార, లా
కులటతనమ్ము నీవును, నిగూఢపుఁదప్పిద మాశచీశుఁడున్
జలితమనస్కులై నెఱపినా రన సంతసమా తలోదరీ !

వాక్కులచే స్తుతింపఁ దగువాఁ డనియున్; స్తుతిరూప మైన యా
వాక్కు మహేంద్రునింగుఱిచి వాకొనఁ దా నసమర్థ యంచు, నా
వాక్కుకుఁ జేరకుం డనుచు వాకొనె భాస్కరుఁడుర్క దదర్థస
మ్యక్కలనన్ ద్రిభంగిగను; మానిని ! లే విట లౌకికార్థముల్.

పతితపావనతా ప్రభావంబు రామ
మూర్తికిం గూర్ప నీకథ పుట్టె నందు
అందులకు వాలి శబరీ కబంధగాథ
లున్న వేగద! యిటులెన్నఁ జన్నె నిన్ను ?

లోలత నిన్నుఁ గోరి విఫలుం డగుటన్ ససిచక్క నీసరిం
బోలని శుష్కజీవి కొకబూడిదబుస్సన కిచ్చి నిన్ను ని
ల్లాలుగఁ జేయుటం దలఁచి యాహరి నిన్ గికురించె నందు; రీ
వాదములో మహేంద్రతయు వానిబుధత్వము నేతిబీఱలే ?

దేవకార్య మ్మొకండు సాధింపఁ బూని
వృత్రహుం డిట్లుగాఁ బ్రవర్తించె నంద్రు;
కొమరుసామికినై పనిగొనఁగ లేదొ
కానిపోని యీసంసారఘాత లేలొ ?

గోచర మైనరీతి మునికుంజరుఁ డాడెనుబో తదర్థముల్
చూచినయట్లు నేఁటికవిశూరులు కొంద అభావ్యపద్ధతిన్
దోఁచినరీతి మందుడుకుతో నిను దిద్దిరి పణ్యకాంతగా
నేఁచి; శివేతరక్షితికి నిట్టి కృతుల్ సహకారులా సతీ !

తెలియరానివి మనుజబుద్ధులకు దేవ
తాగహస్యముల్ మునులగాథాపథాలు
వీనిఁ దడవక లోకప్రవృత్తి నెఱఁగి
ధర్మమును జాటు టొకటె యుత్తమము కవికి.

చిత్రవిచిత్రగాథలఁ బచేలిమమై యతిలోకపాత్రసం
సూత్రిత మై, రసపరిస్మృతిసూక్తి భిదేలిమ మైనయాదికా
వ్యత్రయి కల్పసత్ఫలమె యా; నది స్వాద్యతమంబు నై యిహా
ముత్రిఫలప్రదం బయి యపూర్వత నీయదె భుక్తిముక్తులన్.

ఎవనికి శక్య మౌను బఠియింపఁగ నాశతకోటివిస్తర
పరివహిత మైనరామకథ; భారతి యేపరవళ్ళ తొక్కెనో
కవనపథాల, నయ్యది యగమ్య మమేయ మనూహ్యమయ్యునున్
నవనవకల్పనాకథ వినంబడు నిన్నుగుఱించి యొక్కచో.

ఇతివృత్తమ్మున భిన్నవృత్తి, రచనాహేవాక, మాదివ్యని
ర్మితిలో భావనిబంధనానుగతి, యాత్మీభూతసద్రీతి, య
ద్భుతపాత్రౌచితి, యాదికావ్యమునయందుంబోలెఁ జూపట్టు నా
కృతి సీతాయన మందు; రార్షముగ సాఁగెన్ దాని వాగ్వైఖరుల్.

నీనాణ్యంబును నీసతీత్వమును రాణింపన్ సుశోభావిని
ద్రాణం బందలినీకథానికయు మాతా! హాళి నాటించి, న
న్నానందాంబుధి నోలలార్చినది; హృద్యం బైనకావ్యంబుగాఁ
దానై సత్కృతి కూర్చు మన్నదియుఁ జేతం బూనితిన్ లేఖినిన్.

"ఇది యార్షమ్మొ యనార్షమా? ససిగ నూహింపన్ బురాగాథ యి
ట్లిది సంభావ్యము కాద? యిందలిది సద్ధేతూక్తియేనా" అటం
చెదెదో యూడఁగనేల? పూర్వకథలం దెన్నెన్నొ వైవిధ్యముల్
కుదురం జూడమె? కల్పభేదమున నెక్కొవే కథాభేదముల్?

శిల్పము చెక్కఁబోవను విచిత్రనిగూఢవిమూఢభావనల్
కల్పన చేయఁబోను, నుడికారపుఁదీపులు మీఱఁబోను, నా
జల్పితముల్ రసాభ్యుచితసారము లౌనటు చేసి, సత్కృపా
నల్పకటాక్షవీక్షల ముదావహ మౌనటు చూడు మంబరో!

---

# అహల్య

(జ న నా ది)

"సంభవామి ధర్మసంస్థాపనార్థాయ"
అన్న యోగవిద్య కనుగుణముగ
అజుఁడు వాణితోడ నవతారమెత్తెను
ధరణిపై మహర్షి దంపతులుగ.

ఆజని వారిగర్భములయం దుదయించిరి దివ్యరూపవి
భ్రాజిత లిర్వు రమ్మలు శుభప్రదలై శ్వచయు న్నహల్యయున్
పూజితపుణ్యశీలుఁడు తపోనిధి గౌతముఁ డాద్వితీయ సం
భోజదళాక్షిఁ జేకొనెఁ బ్రమోదముతోఁ దనకున్ ద్వితీయగన్.

నెఱపె గౌతముఁ డామెతో నిర్ణిరోధ
పరమగార్హస్థ్యవిధులు నిబ్బరముతోడఁ,
గురిసె నామెయుఁ బతిసేవ లొలసి పర్వ
సంతతానందవృష్టి సంసారమందు.

నిలిచె పూని యహల్యావినిద్రభక్తి
పూర్ణహృత్పద్మభృంగ మైపోయి కడల,
నిలిచె నామెయు శృంగారవిపణివీధి
కావిరాజితమునిమనోభావమణుల.

తెలిసె నామెయు మునిమనోదీధితులను
అరసె నాతఁడు సాధ్విపుణ్యంపు బెడఁద
అలమె కొనలెత్తి వీరలయాత్మలతలు
లీలగ సుమించి మించి ఫలించె నంత.

పున్నామనరకంబు పోదట్ట మగమొల్క
యవసరం బని ముని దైనవాంఛ
క్రతుసిద్ధి పితృతారకమ్మ కన్యారత్న
మవసరం బని పత్ని దైనకోర్క
ఔర్ధ్వదైహికసత్క్రియల్ దీర్ప మగమొల్క
యవసరం బని మౌని దైనయిచ్ఛ
ముద్దుముచ్చటలకై ముదిమిఁ దోడ్పడ బాల
యవసరం బని పత్ని దైనయాశ

ఆశ లీడేరఁ బ్రొద్దు లంతంత గడువఁ
దపసియిల్లాలు నీళ్లాడి తనయుఁ గాంచె,
పుట్టినంతనె నూర్నవ్వు లుట్టిపడుటఁ
బుత్త్రకుఁడు శతానందుఁ డై పొదలుచుండె.

జోలల లాలిపాటలను జోకఁగఁ జేసెడిబోసినవ్వులన్
గోలల సంకశయ్యలను దుందుడు కొప్పెడిప్రాకులాటలన్
లీలల విద్దియమ్మల బలేనడలన్ నుడులన్ దువాళులన్
బాలుఁడు బాల్యముం గడచి ప్రౌఢి వహించె నొకింత; యంతలో.

గర్భాష్టమమందున నా
యర్భకుఁ డుపనీతుఁ డై యుపాధ్యాయుకడన్
నిర్భరుఁ డై తొలిచదువుల్
నిష్ప్రత్యూహముగాఁ బఠించె నియతిన్ వార్చెన్.

ఆశ్రమపద్ధతు లన్నింట నారితేఱి
రూపయౌవనసంపన్నిరూఢి మీఱి
పైతృకతపఃప్రభావసంపత్తి కోరి
పరమనైష్ఠికుఁ డయ్యె నాబ్రహ్మచారి.

గ్రామము లర్వదింటికి నిగారపుఁజేలిక మైనవాఁడు, సం
గ్రామసహస్రబాహు వనఁగా సరిగాపులు గొన్నవాఁడు, ను
ద్దామధనాధినాథులఁ గదర్థులఁ జేసినవాఁడు, పూర్ణసు
స్థేముఁడు బ్రహ్మసంభవుఁ డధీతసమస్తకళాకలాపుఁడున్.

అతఁడు ప్రకాశవహుండు, కన్యాలలామ
లేమ యతని కొక్కతె లేక లేక కలిగె
పుణ్యభాగ్యములే పెట్టుపోఁతలుగను
బెంచె నల్లారుముద్దుగా బిడ్డనతఁడు.

తనివాఱఁగా సతీధర్మమ్ము లెఱుఁగుచు
నాట్యకళాధురంధరత నెఱఁగ
వంటలు వార్పులు వడ్డింపు లెఱుఁగుచు
స్వరవర్ణకృతులవిస్తార మెఱఁగ

# అహల్య

పరివార గౌరవప్రాభవం బెఱుఁగుచు
గురుకులసేవల నెఱపు టుచేఁగ
కావ్యలక్షణతత్త్వ కలన నెఱుంగుచు
రూపకరచనానిరూఢిఁ గాంచె

జనతి యాకన్నె పెండ్లీడు సాఁగి రాఁగ
గౌతమునిపుత్రునకు దానిఁ గట్టిపెట్టి
యీడు వచ్చినయంత నాయిగురుఁబోఁడిఁ
గాపురముచేయఁ బంపెఁ బ్రికాన్వహలుండు.

తెప్పలుదేలు ప్రేమనిరతిన్ జనతిన్ గను మానిపుత్రుఁడున్;
ముప్పిరిగ్రమ్ము సత్ప్రణయమున్ నయమున్ బచరించు నామెయున్
ఒప్పులకుప్పయై గురుజనోచితసేవలు దీర్చువేళలన్
దప్పక చెప్ప కాతఁడు ముదంబునఁ జేఁ జెయి కల్పు నామెతో.

నారీరత్నము ధర్మపత్నిగ శతానందుండు కొన్నేండ్లు సం
సారానందము చూఱలాడి గురునాజ్ఞం బూని యధ్యాత్మవి
ద్యారాహస్య మెఱుంగఁ దాపసులపుణ్యావాస మై యొప్పుధ
ర్మారామమ్మును జేరె దాల్భ్యముని నాత్మారాము సేవింపఁగన్.

(అహల్యా గౌతములు)

(వరదానము)

కాని యోసి యహల్యా! పూరుషుఁడు నిత్యానందుఁ డై సంతత
ధ్యానోన్ముద్రితుఁ డై జితేంద్రియుఁడు నై తత్త్వానుసంధాత యై
పౌనఃపున్యసమాధినైష్ఠికత సంపాదింప సత్పత్ని, య
న్యాసం బైననిదానమండ్రుసుమి; ధన్యుల్ గారె తత్త్వాదృశుల్.

నాకసుఖంబు లింటనె గనంబడఁ జేయుఁ, గుటుంబభారముం
దేఁకువఁ బూను, వంశప్రతిష్ఠల నిల్పుఁ, బతిన్ భజించు, ము
మ్లోకము లేక నైసఁ దనలో నెల వీయ దధర్మవృత్తి, క
ట్టాఁకలు వెట్ట, దిట్టిదిగదా సతియన్నది యార్షపద్ధతిన్.

ఆర్షపద్ధతు లనుచుంటి వంతె గాని
వానియర్థ మెఱుంగ నెవ్వారికిఁ దరము
అడుగడుగుగండ మాయాత్ర; యది సుగమము
సుఖతరము నయ్యె నీదగుచూపు కతన.

నాగృహస్థత కిపుడు ధన్యత లభించె
పూర్ణసంతృప్తి నీవల్లఁ బొందినాఁడ
కోరు మొకవర మది యెట్టితీరుదైన
నీయఁగలవాఁడ నిపుడె రాకేందువదన!

హృదయం బందిఁ దల వం
చెద వేలనె? యేమి యావిచిత్రపుమురువుల్
అదవద లేటికె వరముల్
ముదితా! కొను; నాప్రణయముం గొనరాదే?

అన విని యర్థ మయ్యెను మహాత్మ! భవద్గురుబోధ, యంత వా
కొనఁ బని లేదు మాదృశులఁ గూరిచి; యింతకు భర్తృపుణ్యాభా
గిని యయి వారికష్టతతికిన్ సతి పాత్రము కాకయుండునే
యన వినఁ గ్రొత్త లే మిటఁ గృతార్థులఁ జేయుటగాక మమ్మిటుల్.

వరమా? కోరుటలా? యి వేమిచనవుల్ వాచంయమేంద్రా! భవ
త్కరుణాదృష్టి యొకండు చాలదె జగత్కల్యాణపల్యాణమై,
వరముల్ భీకరముల్; కృతార్థతలు మీవాల్లభ్యముల్ సంపదు
త్కరముల్ లేవె భవత్కృపావిలసన గ్రైవేయహారావళుల్.

అన మానిపత్ని యింగిత
మును గుర్తించుచును గౌతముం డాసతికిన్
దనహృదయము నందీయఁగ
ననె ప్రేమోల్బణత పల్కులం దుట్టిపడన్.

ఈయనులాపముల్ పలుకు లెందులకే మిసిమింతురాల! నే
నే యిడువాఁడ; లోకహిత మెంచి తలంచినకర్జమందు నీ
దే యగుఁగాక దిగ్విజయ; మీవర మిచ్చితిఁ బూర్ణతృప్తి; నో
తోయలి! భక్తితత్పరతతో నతితో నుతితో గ్రహింపవే!

అని ప్రసాదింప నమితాంగి యై మహాప్రి
సాద మట్టులుగా శిరసావహించి
లోని కేఁగె నహల్య; యీ లోన శిష్య
తతికి బోధింప నచటు గౌతముఁడు గదలె.

---

# అహల్య

(విజయము)

పుణ్యకథాసుధాబ్ధి కది పుట్టినయిల్లు; నిరస్తకిల్బిషా రణ్యకపణ్యవీధి; స్మృతిరాజ్యరమాచరణప్రచారసా ద్గణ్యము, మౌనితాపసవిధుప్రథమాననభంబు, దండకా రణ్యము, మంజుకుంజతరురాజిశరణ్యము నగ్రగణ్యమున్.

కల దట గ్లేవ్యమండల మొకానొక క్రేవను; గ్లేవ్య లందురా నెలవున నున్నవారల, మనీషులు వైదికు లయ్యు మాంసభు క్కులు నయి భాష లాకడ నిగూఢముగా మనుచుండ్రు, వేదవి ద్యలు పఠియింప గౌతమునియాశ్రమభూమికి వచ్చుచుందురున్.

గ్లేవ్యసంజ్ఞ మాండలికమై కీలుకొనిన
జాతిచే వార లుద్గవ్యసంజ్ఞఁ గనిరి
కర్షణాఖేటకాద్యాజ్యకలన నచటి
జనులు జీవిక నెట్టటో జరుపుచుండ్రు.

అట జనస్థాన మందుండి యడ్డుదారి
గౌతమాశ్రమముం జేరఁ గల దొకండు
అనుదినము గ్లేవ్యు లాబాట ననుసరించి
రాకపోక లొనర్తు రట్టాఁక వడక.

యాతాయాతము లిట్లు గ్లేవ్య లనునిత్యంబుం బొనర్పన్ వృథా
జాతక్రోధుఁడు చేఁడు మామకజనస్థానపరిచారంబు మీ
జాతుల్ మానుఁడు, మీ రవాచ్యులు నసంస్కారుల్ పలాశుల్ ఖల
వ్రీతుల్; దుష్టుల దూరమం దునుచు టుర్విం జెల్లుఁగా ధర్మశ్రమై.

పొంకము సెడి యధ్యయనా
తంక మ్మని గ్లేవ్యలెల్లఁ దాపపడుచు నీ
సంకటము గురులతో ని
శ్శంకముగాఁ దెలిపి రెన్నిసారులొ తామై.

కావలసినట్టివారల
తో వైరము లేల యనుచుఁ దుద కాయమియున్
ఆవంతయైనఁ దలపఁక
యానంత తోలంపఁగాఁ బ్రియత్నమె మానెన్.

చిఱుచిఱుగాలివాన యయి చిల్వలఁ బల్వలఁ బూఁపపిందెలన్
పెరుగుచుఁ బెద్దవృక్షమయి, భీకర మయ్యెను గ్లేవ్యజాతితోఁ
దఱుఁగనివైర మాన్యపవతంసున; కంతటఁ జల్లురాకలున్
గుఱుచగు టాఁకుహల్య కనుగొంచును గౌతముతోడ నిట్లనున్.

కలకలనాదమేదురవికస్వరసుస్వరముల్ సెలంగఁగా
తొలిచదువుల్ పఠింపను విధుంతుడుఁ బోలిఁ శిష్యసంతతుల్
తెలతెలవాఱునంతఁ బఱతెంచెడివారలు; రారదేలొకో
తొలుతటిరీతిఁ గారణ మెదో వినఁగూడినఁ దెల్పఁగోరెదన్.

హృద్వికాసనములును సర్వేంద్రియప్ర
తర్పణంబులు వేదవాదములు, వాని
వినుటమఱఁగినశ్రోత్రము లనుటమఱఁగి
నట్టిజిహ్వయు మిమ్మెట్టు లడుగఁ బనిచె.

దాఁగిలిమూఁతలేల వనితా! పరమార్థము నెంచి చూడ నీ
భోగము మూఁడుపూఁట లనిపో తలఁపోయఁడు నీదువియ్యమున్
రాఁగలదేమి యిందుఁ దనరాజ్యముమీఁదుగ గ్లైవ్యమండలిన్
సాఁగఁగనీఁడు; చండతరశాసనుఁ డాతఁడు నీ వెఱుంగవే?

ఉన్నవి లేని వుండని వెవో మనశిష్యులయందు లోటు లు
త్పన్నము సేసి లోకులయెదల్ కదలించుచు, గ్లైవ్యజాతితో
భిన్నత పాడుకొల్పి తనపెద్దఱికమ్మును జాటుచుం దద
భ్యున్నతి నోర్వఁ డెన్నియొ కుయుక్తులు పన్నెడు నాఁడునాఁటికిన్.

అతని కనుచాటుగా వత్తు రప్పు డప్పు
డంతెకాని నిరంతరాయములు గావు
వారిరాకలు; దీనిఁ దీర్పంగ నేరు
పూనుకొనువారు చెప్పవే పూవుఁబోఁడి.

గురుభక్తుల్ సుతనిర్విశేషు లపరాగుల్ గ్లైవ్యశిష్యుల్ గుణో
త్తరు లవ్వారల నడ్డి యేమి తలకుం దా నెత్తుకోనెంచెనో
గురుదేవా! వర మిచ్చి కావఁగఁ బరాకుల్ సేసినా రేలఁ జు
ట్టఱికం బన్యులఁ జూచుకొంద మది తాటాతూట మై దోఁచినన్.

కాలం బోయెడుదానిని
గోలా! తలపైకిఁ దెచ్చుకొనఁ దగ వగునే?
లీలం గొనగోటను బో
నేలా గొడ్డలికిఁ బరువు లెత్తు టహల్యా!

అనఁగలమాటయే యిది మహామహా! సద్గురు నాశ్రయించి యే
పునెములనేని కొన్నిచదువుల్ చదువం దమదారిఁ దాము పో
సను వగుచట్టుఁగుట్టల నిరర్థకతన్ బనిపూని యడ్డుటా?
మనమయి దీనిఁ దీరుపక మానిన ఛాత్రులు నొవ్వకుందురే?

ప్రజలను దిద్ది తీర్పక సభాజన చేయక యున్నఁ బోయెఁ గా
కజగరుఁ డై ప్రజేచ్ఛలకు నడ్డులు కట్టుటలా? యి వేమి భే
షజములు? పల్కుఁడయ్య మునిసాములు? రాచటికమ్ము దీనిలో
నిజమున కున్న దే? నిలుచునే యిది సుస్థిరమై జనస్థలిన్.

మాచిత్తంబులు తామరాకులుగదే, మా కేల లోకమ్ముతో
నీచిట్టంటులు? ముక్కు మూసికొని తన్వీ! మూలఁ గూర్చుండ, నీ
సాచివ్యంబు లవేల? దుర్గమము లీసంసారబంధంబు లే
మో చెప్పం దల కెక్కునే ససిగ, నానో కాదో చర్చింపుమా!

ధర్మమును నిల్పునట్టిబాధ్యతలు, పాల
కులకు నెంతటివో ప్రజావలికి నంతె
ప్రజలు కారా మునుల్? హానభావ మిండ్లు
దగ్ధ హాచుండనా? యేటిధర్మ మార్య!

వాదికిఁ గాని దుర్బలత వాదమునం దది లేదు కాంత ! యీ
భేదము శుష్కతర్కపదవిం బడనేల? తొలంగఁబెట్టుమా
నీ దగుశక్తిచూతము :— మునీ! యిది యెంత భవద్వరప్రభా
వాదృతి లేదె వజ్రికవచాకృతి సిద్ధము కర్జ మీత్రుటిన్.

నాయము నెంచి దిద్దికొనెనా సరి, దూతముఖంబుగా, దుర
న్యాయము నీప్రవృత్తి యని యాడెద, నెప్పటియాట యైనచో
కో యనఁ గోటి మించి మనకుం గలవయ్యెను ఛాత్రవర్గముల్
సాయము కోరి పాలకు వశంవదుఁ జేసెద నాహవమ్మునన్.

కరబదరమ్మె నాజయ; మఖండితతాదృశశక్తియుక్తి సు
స్థిర మగు ధర్మపాలనవిధిన్, బయిపెచ్చులు మీవరమ్ములున్ :—
తరుణి! "తథాస్తు శిష్యజనతాసుఖమస్తు జయో" స్తటంచు నా
వరదుఁడు గౌతమార్యుఁడు శుభం బెదఁ గోరెను నిష్క్రమించుచున్.

దూతకార్యంబు నడచెను దుదకు తేఁడు
దిద్దుకోలేదు, తనతప్పు తెలియ లేదు
ఆయుహల్యయు ననుకొన్న య ట్లొనర్చి
కైవసముచేసె రాజ్య ముగ్గవ్వలకును.

—

## నారదుఁడు — ప్రక్రావహుఁడు

( ఉ ప దే శ ము )

ఎందులకు లేదుగాని నా కిందు నబ్ర
మాఁడుది జయించుటా మండలాధిపతిని?
జరుగుటే తడవ ప్రతిష్ఠలు ఘటింప
దెబ్బ దేవేంద్రలోక మందించుటయున?

నెయ్యపువియ్య మీతఁ డనినేని రవంత పరామృశింపకే
కయ్యపుఁదియ్యపుంబస జగామగవాఁ డనిపించుకొన్న దే:—
అయ్య! య దేటియాఁడుది? శతాధికశూరులు తీసికట్టు లా
తొయ్యలికన్న నమ్మఁదగు; దుర్భరముల్ తదధీనశక్తులున్.

ఆఁడుదికాదు నారద! మహాస్త్రవిశారద, పింజపింజగాఁ
గాఁడఁగనేయుశక్తికిఁ బికాపిక లయ్యెను సేనలెల్ల; నా
పోఁడిమి మాఁడె నింతటియపూర్వపుఁగయ్యము పుట్టి నేఁటికిం
జూడను జేయనుం దలపనుంజుఁడి; యాపస లత్యపూర్వముల్.

ఓటమిమాటయే వ్రణమయో! యటుపై నబలాకృతమ్ము; సా
బోఁటియుఁ జుట్ట మే మనఁగఁబోల్ తలకొట్టుట లయ్యె నారదా!
దాఁటుదునే త్రపాజలధి, దాఁటుదునే వనవాసదావమున్
కోటలు దాఁటకున్నె యివి గుట్టుగఁ బట్టిన దాఁగునట్టివే?

ఐన దైవనది దీనికై యంతవంత
నందఁగా నేల? యుద్ధజయాపజయము
లొకరిచేతివె రాజా! బహూక్తు లేల?
సాధనకు దార్లు శతసహస్రములు గలవు.

ఆఁ! యేమంటిరి? సాధనల్ గలుగుచో నాయాసమే లేదు, సా
మీ! యీబాదలబంది తీఱెనటె, సెల్వీం డొక్కుపాయమ్ము, మీ
ప్రాయమ్ముల్ నుడువుల్ సుబోధలును లోకారాధ్యముల్ గావె, నా
కైయీరాకలు గల్గెనేమొ మునిలోకగ్రామణీ! ధన్యుఁడన్.

నుదుటికర్మఫలము నోనాడి పోనాడఁ
జేయ దిగితి గానఁ జెప్పఁ దలఁతు
ననుచు నూఁది పోయె నాతనిచెవిలోన
నారదుండు నయవిశారదుండు.

దేవమునీంద్రుఁ డాసదుపదేశము చేసిననాఁటనుండి పవి
త్రావహుఁ డాత్మపత్నియుఁ బగన్ మునిదంపతు లౌచు, నైజహా
భావనచే నహల్య నెటో వంచితఁ జేయఁ దలంచి నిల్చి రా
పావనగౌతమాశ్రమపుఁబజ్జల నొక్కకుటీరమందు సన్.

—

* * * * *

పందిరి వెట్టినపగిది మింటఁ జరించు
తూనీఁగలకుఁ బెండ్లితొంద అయ్యె
చెదపుర్వులకుఁ గండచీమల కానంద
గమనాతిరేక మగ్గలము నయ్యె
పర్జన్యసూక్తముల్ పాటించి పలుకుబో
దుఱుకప్పలకును దుందుడుకు హెచ్చె
నెఱియల డాఁగువన్నెలపాఁపపూఁపల
నడలకు గొంగ్రొత్తయొదుపు కుదిరె
శాద్వలం బనుపట్టుసాలువుఁ గప్పికోఁ
గుంభిని కోకకోర్కి కొనలుసాఁగె

గగనవల్గనములు చాతకముల కెచ్చె
నింద్రగోపఫణాటోప మినుమడించెఁ
గడలుకొలిపెను భూసతి కమ్మతావి
చిత్రవృష్టులు పుడమిపైఁ జినుకునపుడు.

పుడమి కాడంగఁ గవ్వడి నాఁటుతూఁపుల
వడువున వడగండ్లజడులు వడెను
కడుపుమంటలపేద కార్చుకన్నీటిధా
రలునాఁగ వర్షధారలును రాలె
ఆణిముత్యాల్ దొర్లినట్లుగాఁ బూరిండ్ల
పెణకల వర్షోదకణము లురలె

తేలిపోయెడిగాజుగోళీలునా వాన
    నీట బుద్బుదము లెన్నియొ నటించె

గగన మాగడపలు వెట్టి కాఱు క్రిమ్మె
తరుల నల్లటపఱచు వాతమ్ము ద్రేఁగె
సిగలఁ జివురులు తుఱిమి వాసించె లతలు
కువలయంబునఁ దొలికాఱు గురిసినపుడు.

చివికి నిట్టూర్చుప్రోషితభర్తృకనుబోలి
    భూకాంత గ్రీష్మమ్ము పూత్కరించె
జీవనభారము చేఁబూని పయనించు
    చనుపనాఁ గార్మొగుల్ చదలఁ గదలె
ప్రళయతాండవకేళిఁ బలుకుఢక్కావాడు
    క్కాలునా దివి ఘనగర్జ లుఱిమె
అలికాఱ్ఱుఁ డగ్గిక న్నల్లార్చినవిధాన
    దొలకరిమెఱుపు లుత్తలము గొనియె

బడుగుఁగడుపులు బంగనబయలుగాఁగ
బీఁటవాఱినగుండియల్ పెటిలి చిటిలి
పూనమున కట్లు పడియున్నకోనలెల్ల
మొనసి తొలివానలకె నీరు మోసికొనియె.

* * * * *

(అహల్యాగౌతములు)

(ప్రక్షేపము)

కొండపల్లియలకు మేలుకొలుపుఁబిలుపు
ధర్మకాహాళి వైదికకర్మఠులకు
హ్రస్వదీర్ఘప్లుతోచ్చారణాధికారి
కమ్మ; మొఱసెను కృకవాకుకలరవమ్ము.

ఇది నది కేఁగువేళ రమణీ! జపమాలయుఁ గుండిఁ దెచ్చి యీఁ
గదే; యట దండెమందు మడిగాఁ బడనైచితి నంగవస్త్రమున్
బదిలము గాఁగఁదే; మెలఁకువా నిదురా యిది? బద్ధకింతువే
మదవతి! తెల్వి తెచ్చికొని మాపయనమ్ములు సాఁగనీయవే.

మెలఁకువెగాని సామి! యటు మిన్నులు గాంచుఁడ, కార్మొయిళ్ళు, వి
చ్చలవిడిఁ జౌకళించుచుఁ దుషారము రాల్చెడిఁ, జిమ్మచీఁకటిన్
చలివలి పీఁచెడిన్, నడలు సాగవు, నేటికి, నేటి కేటి కీ
వెడలుట మాని నాదుమనవిన్ విని కృత్యములింటఁ దీర్పఁడా!

స్నానమున కేఁగువానిని
వానఁటె బాధించు? నంగవస్త్రము తేవే
చానా! తావళ మీవే
నానియమముఁ దప్పఁబోదు నా యర్థాంగీ!

అనుడు గృహస్థమార్గముగ నాడినమాటలుగాని పూని యో
మునివర! యార్షపద్ధతికి మోసము దెత్తునె యెంతమాట ? యో
జనతి! వడిం గమండలువు సాలువునుం జపమాల తెచ్చియి
మ్మనవుడు మామగారి కపు డాయమ యిచ్చె సభక్తికంబుగన్.

నీకనుఁజూపు వెన్నెలలనే పచరింపుము నాదుబాట వె
ల్గై కమనీయమై సుగమమై తగు నోచపలాక్షి! యప్పు డీ
చీఁకటి గీకటిం బగటుచిన్కులు గిన్కులు గాలి గీలి యా౦
గా కవి లెక్కరే పడఁతుకా! పయనింతు నదీపథమ్మునన్.

అని చమత్కృతిగా మాటలాడి; తనదు
నడలు విశ్వంభరకు వ్రేఁగు నడరఁజేయ
పూని పయనించుచుండె; నెమ్మదిగ బలిసి
జోరుజోరునఁ గురిసె నాసారవృష్టి.

అంత నయత్నపూర్వముగ నానడ లాతని నీడ్చివైచె నా
ప్రాంతనె యున్నయొక్కమునిపుంగవుపర్ణకుటీరమున్, దద
భ్యంతరు లాతనిం గుఱుతువట్టిరి, పంచను జేరియుండఁగా
వింతప్రసంగ మొండు వినిపించెను పూనికి నుల్లకుట్టుగన్.

గుడిగుంచమ్మగ నిండ్లముంగిళుల ముగ్గుల్ వెట్ట, కిల్లాండ్రుచ
ప్పిడిమాటల్ తెలినోర వించుఁ బలువైవిధ్యంపుసంవాదముల్
తడవంబోక సతీత్వధర్మకలనాధన్యత్వసంసిద్ధికై
పడఁతీ! ప్రత్యహ మాయహల్యకును సేవల్ దీర్పఁగా నేఁగుదే ?

ఎప్పు డేఁగుటలో వచ్చు నెపుడో సుంత
గోచరము గాక మాకు కాకొనఁగ వలసె
రేపుమాపులునున్ యథారీతి గాత
దూశ్రిమముసకుఁ బోవుదే యన్న మిన్న!

మీలోకము మీ తెన్నులు
మీలక్ష్యము మీవెగాని మే మెటు లైనన్
శీలింపరుగా పురుషులు
జాలం డీనదుమఁ జిత్రము— అది మీ కేలా?

ఈయర్థోక్తులు సందియమ్ములును నీ కీటన్న లీడన్న లే
లే యర్థాంగి! వచింపుమీ యెడఁద నే మే మున్నదో యున్నటుల్:—
నాయర్థోక్తుల కేమిలెం డవియు విన్నం దప్పులే, దైన మీ
కీయూఁడమ్ములగోల లేల యని నేనే తెల్ప వాపోడుదున్.

మీ లో దర్లలితత్వ మియ్యదియెసుమ్మీ, దీన మీజాతికిం
జేలా! చుల్కన లయ్యె; దాఁపటికమా నీనాయెడందన్ బలే:—
చాలున్ గోపము సేయఁబోకుఁ డది దాఁచం జెప్పెదన్ గిల్లిక
య్యాలం బెట్టకుఁ డింతమాత్రి పతిదేవా! నానమోవాకముల్.

ఇంటను లేరు తా మొకపు డేఁగినదాన నహల్యఁ జూడ నా
దంట శచీపతిం గలసి తత్పరభావన నేకశయ్యపై
నుంట యెఱుంగకే తలుపు లోరగ నుండుట లోని కేఁగితిన్
కంటగిలెన్ మనంబు తదనంతరగాథలు త్రివ్వఁబోకుఁడీ!

నిలువునఁ బోయెఁ బ్రాణములు; నేనెటు లైతినొ యేడ నుంటినో
తెలియదు మీఁద; దుఃఖపడితిన్ దలకొట్టినయట్టు లయ్యె, నె
ట్టులొ యటనుండి దాఁటితిఁ జటుక్కున, నాఁటనుగోలెఁ బోవఁగా
దలఁప నహల్యపొంత, కవి దాఁచిన దాఁగెడునట్టిచేత లే?

తప్పక యాయహల్య జడదారిని గౌతముఁ మోసగించి, తా
నొప్పులకుప్పయౌటఁ బురుహూతునికూటమి నుండ, మేము పోఁ
జొప్పడు నెట్లు? చేఁత లటు సుద్దు లిటుల్ పచరించు కాంతతో
నెప్పుగిదిన్ జరించుచు సహించుచు నుండెనొ గౌతమర్షి యున్.

లోకమాన్యు గౌతము బుట్టలోనఁ బెట్టి
శివశివా! యెంతపనికి వాంఛించె నామె;
హరహరా! రూపవతి భార్య పరమశత్రు
వనెడినుడులు యథార్థమ్ము లయ్యెఁగదవె.

అంతలఁ దీఱెనే శివశివా! హరి కౌఁగిట నుండి యామె "మీ
పొంత సుఖించు టాది ముని ముట్టఁగ నోడుదు, ఆ వ్రతంబు లా
సంత లవెల్ల నాదుగ్రహచారము చాలక దాఁపురించె" నం
చింతి వచింప వింటె; వినెనేనియు గౌతముఁ డెంత క్రుంగునో?

ఈరుదురాకపూసలును, ఈ యజినమ్ములు, దబ్బముద్దరల్
గారలు, భూతిరక్షలును, గాననవాసము, కందముల్ ఫలా
హారము లాకుటెందు లకటా! వికటమ్ములు నిన్నుబోలు నా
య్యారి కటంచు నింద్రుఁడు నహల్యకవుంగిటఁ జొక్కి పల్కఁడే?

పంచఁ జేరినగౌతమప్రవరుఁ డాప్ర
సంగ మంతయు వినుచు నాశ్చర్యచకిత
భావుఁ డై నను దాఁకె నీపలుకు లెల్ల
ఏమి-అహల్య!—శచీపతి!—ఏకశయ్య?

పెండిలినాఁటియూసు తలఁపింప దివస్పతి ద్రోహచింతతో
నుండెనొకో? యహల్యతలఁ పుండెనొ శక్రునిపై నదేమి గా
ఢుండఁ బ్రసంగ మి ట్లగునొకో? జగజంతలు కాంత లంచుఁ దాఁ
గొండొకసందియమ్మున విఘూర్ణిలుచున్ వినుచుండె మౌనియున్.

"అదియటే కథ! యాయహల్యాలలామ
సతులలో నగ్రసరగదా? చర్య లిట్టి
వా? సుబోధన లిట్టివేగా! యిఁకేమి
తగెనుబో గౌతమర్షి కాధర్మపత్ని.

నిరతజపోపవాసపరనిష్ఠను, సద్వ్రతబ్రహ్మచర్య త
త్పరతనె జీవితమ్ము గడుపన్ గృహియౌ టది యెందుకోసమో?
యెఱుఁగడె గౌతముం డిది గ్రహింపమిచేఁ గద యింత మూఁడె నీ
పరిణతి యింతకింత తలవంపులు గూర్పదె మౌనికోటికిన్."

ఇదిగో మావ్రతనిష్ఠల
పదనులు, చర్యలు, రహస్యపద్ధతు లెల్లన్
గుదిగొనుచు వీధి కెక్కెను
ఇది నను గా దనినఁ బోవునే? యకటకటా!

తప్పక మమ్ముఁ గూరిచినదాఁపతికమ్ములు వెల్వరించు నీ
చొప్పది నన్నుఁ దాఁకుట త్రిశుద్ధిగ నమ్మఁగవచ్చు, చెప్పకే
చెప్పుచు నున్న దామె వలచెం బురుహూతుఁ జెడెంగులంబు; నా
ముప్పునకుఁ దిప్పలా యివి ప్రభూ! యని గద్గదఖిన్నకంఠుఁడై!

ఎంతపాపాని కొడిగట్టితే యహల్యా!
నన్ను నట్టేట దింపితే వన్నెలాడి!
గౌతమయశస్సు గంగలోఁ గలిపి కులట!
యింద్రుతోఁ గూడ నీమన సెట్టు లొప్పె?

తనలోఁ దా నిటు తర్కవాదములు సంధానించుచున్ బర్ణశా
లను జేరెన్ బదియంగలన్ ముఖసుఖోల్లాసంబు మాయన్ గిరు
క్కున; నేదో బలు పైనపెన్వెతఁ జిరాకున్ బొందు, మానమ్ములున్
అనుమానమ్ములు, శూన్యదృక్కులును, వాచాతీతదుర్భావనల్.

స్నానము, ధ్యానపానములు జాఱెను, నిష్ఠలునున్ బ్రసంగముల్
లూనము లయ్యె, నిద్దుర విలుప్తము, రేవగ లొక్కటే పర
ధ్యాన "మహల్యా—దేవపతి—హా" అను వేదన తప్ప నన్యమున్
మాని యెఱుంగఁ డొక్కట ననంతము భేదిలి మీఁదఁ గూలినన్.

మానముద్రి లస్పష్టసంభాషణములు
కోపతాపము లాకృతిగోపనములు
తనకుటీకుట్టిమస్థితి, జుణుఁగుటలును
మానిచంద్రుని జిటికెలో మార్చివైచె.

శంకాతంకకళంకితుం డగుమునీశానున్ నిరీక్షించునా
పంకేజాసనుపుత్రి యే మనుకొనంగ బాల్యోక్తి, హాసంబు, లీ
యంకాపాంకము, లీసు, లీవికటహాసాంకూరముల్, క్రొత్తలై
జంకుం గూర్చెడు సామి; నాదువరివస్యల్ నచ్చ కిట్లైతిరా?

అడుగుదున సామి! ఆగ్రహంబా యనుగ్ర
హంబ యిది? దురూహం బైనయట్టిమార్పు
కలిగె మీలోన, తద్భావకలన యుమ్మ
దానసమ్మున నగ్నమ్ముగా నటించు.

ఔ నిది నగ్ననాటిక యథార్థము, దీనం గలట్టిభావమున్
జాణ లెఱుంగరే యళికచా! నటనాపటుశక్తియుక్తులున్
సానలు దీఱువజ్రము లచంచలభావలు; మాదృశుల్ తపో
లూనసమస్తకాములు విలుప్తవిలాసు లెఱుంగ నేర్తురే?

బహులపరిణతితరలదుర్భరదురంత
ఫలదములు గావె సంసారభాగములు; మ
హామహులనేని గిలగిలలాడం జేయు
లేమ! మాకోపముల కేమిలే నడుంక?

ఇదమిత్థం బని వాకొనం దగనుగానీ హాసి! మీవాణియం
దది యేదో ధ్వని, గుండెగాల మగుసన్థాపత్తి, మీచూపులం
దెదియో తీక్ష్ణత, చేష్టలం ద్వరయు నెంతే దోంచు, నే మంతంగా
హృదయస్పందను? కొత్తలున్నెయిట సామీ! యూహ కందింపుండీ.

పొంగి పొరలెడి బాధానుభూతి యేదో
గుండెలో నండలండలు గూల్చికొనుచు
ముప్పిరిం గ్రమ్మె నాతలముక్క లయ్యొ
హాని! తమహానమున కర్థ మానతీరె ?

అంతదుందుడు కేలే యహల్యా! స్వాంత
మెంత పాషాణమో యంత కంత మృదువు
తగిలెనా దాని కొక్కఘాతమ్ము; వెన్న
పూసయై యిట్టె కరంగిపోవ కున్నె ?

ఆఁ! మనస్సున కాఘాతమా ? అదేమి
కొండయే తేలి మున్గెనా బెండు సామి :—
చిత్తవిక్షేప మాఘాతచేష్టితమ్మ
చెదరినది కూడఁగట్టుకోఁ జెల్లదటవె ?

కరఁగిననేయి పేఱుకొనఁ గాలము పట్టును; ముండ్లకంపపైఁ
బఱచినచీర నేసుపునఁ బట్టి తొలంచఁగ నొప్పునే కదా :—
సరి యది; యిందు వ్యంగ్యపుఁబసల్ విషదిగ్ధము లమ్ము లౌచు సన్
గఱచెడి, గంట్లువెట్టెడి మనస్సును, నింగిత మింతఁ దెల్పుఁడా!

పిల్లిచెలిగాటమా సామి! బీఁటగిలిన
హృదయఖనియందుఁ జలిమంట లిడినవారె
అరసెదరుగాక వెలుఁగు చల్లారకుండ
రతనము లవెన్నొ యందలి ఱా లవెన్నొ ?

ఎందుకే యింతతహతహ ? కుంది కుర్గి
పోవుచున్నా విదేలనే పూవుఁబోఁడి ?
త్రొక్కి నీనీడ నీవె దుందుడుకు వడుచు
విసము వెలిగ్రక్కుకోనేల ? వెఱ్ఱిదాన !

గురుకులవాసపద్ధతులకుం బుయిలోడక, శీతవాతదు
ర్భరపరిణామఖిన్నతఁ బరస్థలి నొంటిగనున్నకుఱ్ఱఁడి
త్రుటిఁ బరిరుగ్ణుఁడై వివశతం గనెనంచును వార్త వచ్చెనో
తరుణి ! తదర్థమై మనసు తత్తఱమందెడుఁ దోఁచ దేమియున్.

అదవదకున్ నిదాన మిదియా? అకటా! కొడుకెట్టు లుండునో
గద! ములువుచ్చి కొఱడఁచి కట్టెఁడి నైతివె కూర్ర దైవమా :—
ఇది వినెనేని కోడలు సహింపఁగలేదుసుమీ వెలార్ప కో
మదవతి! చూడఁబోయెదఁ గుమారు నిదే యగు నాప్రయాణమున్.

అహల్య – జనతి

గురుకులమువారిమాయవాగురకుఁ జిక్కి
తబిసియెదబేడిసకు వగల్ దాఁకు టెత్తఁగి
తన కుయుక్తిని సాగించుకొనఁగ జనతి
వినయనయభయములఁ గ్రోటుకొనుచుఁ బలికె.

తోఁపక యుండి దీనమతితో నటులుంటి రదేల యత్త ? మీ
చూపులలోనిభావము లచుంబితపూర్వము; లేమి గల్గెనో
లోపము నాయెడన్, మనసులోనిది తెల్ప కెఱుంగఁ బోలునే
దాఁపటికమ్మ లేల? కలతం గొన నేమిటికో వచింపరే?

యాగార్థమ్ములు నిర్వహింపఁ జనినారా? లేక కార్యాంతర
ప్రారంభనిబద్ధులై వదలినారా పూజ్యపాదుల్? సదు
ద్యోగం బయ్యది తీఱ నేఁటికి రా నుంకించిరో యా మహా
భాగుల్? నైష్ఠికు లింతకు న్నిలువ సంభావింతు రే యొం డెడన్.

ఇండ్లు ముంగిళ్లు చిన్నవోయినవి నేఁడు
వెలవెలంబాఱు మనకుటీవేదికలును
తమినిఁ గార్యాంతరవ్యగ్రతను వహించి
యాశ్రమము వీడి మామామ యరుగుకతన.

అడుగుదుమా వచింతుర కలట్టిపనుల్; మగవారి కేవియో
గొడవలు, రాచకార్యము లగున్ దెలవాఱిన; వానియూసు లె
క్కడికని సాహసించి యడుగం దలకొందుము; వారె వత్తు ర
క్కడిపను లైనవెంబడినె; కాఁపుర ముండకుగాదె కోడలా?

ఐనచో నొకమాట; మి మ్మడిగియున్న
దాన లోగడ; మీఁకును దాని జరుప
నియ్యకొంటిరి; స్మృతికి రాదే? మగయ్య
లింట లేనప్పు డన్నార లెఱుఁగఁబడనె?

మొద లంది మ్మది; జ్ఞప్తికిం దగులదేమో కాని; యెన్నాళ్ళనాఁ
టిది? ఆఁ! అన్నటు లేదొ కొంత మదిఁ దట్టెన్, నాటికోదంతమా?:—
అదదే! యాతరుణమ్ము దాని కనువౌనమ్మా! పరిదర్శింతమా?
యిది నాముచ్చట తీర్చు టౌను; మదికెంతే సంతసం బయ్యెడిన్.

చికిలి చేసిననీయూర్వశీపురంద
రోపరూపకఫణితి సర్వోజ్జ్వలంబు
వింటి నొకనాఁడు; దాన భావింపరాని
రసవదభినవనిర్మాణశక్తి వెలయు.

మామగా రూరి కేఁగుట, మనసు దీఱ
నీవు కోరుట, నామాట నిలుపుకొనుట
కలసిరానయ్యె; నబుసుపోకయును గలుగు
దాని నీ రేయి నటియింపఁ దలఁపవలయు.

ఈవు పురందరుండ వయి తేనియు నూర్వశి నాదు నేను, కా
కీ వలయూర్వశీత్వము వహించిన నేను మహేంద్రభూమికా
భావము సందెద న్నుభయపక్షములన్ భవదీప్సితార్థ మే
దో వచియింపు మన్నఁ బరితోషమునందుచుఁ గోడ లిట్లనున్.

నేఁ బురందరభూమిక నిర్వహించి
కౌశలము చూపి మెప్పింపఁ గలుగుదాన
ఊర్వశికి వంకలం దిద్దుచున్నమీఁదు
రూపురేకల భూమికాలోప మున్నె ?

అనుచుఁ దనపన్ను గడ కెంతొ యనువుపడఁగ
అత్తను యథాతథముగ నాయత్తపఱచి
నారదవరప్రభావమ్మునన్ జనతియు
సద్యముగ నింద్రరూపున నవతరించె.

అది యొకముగ్ధమోహనకళాలయ మాయనవద్యనిర్మితిన్
గుదిరిన వెన్నియో యొదుపుఁగుప్పలు, సద్భుతసన్నివేశముల్
గుదిగొనువేడ్కతోఁ నటనకుం దిగి రచ్చపుఁబాత్రధారు లా
యదనునఁ దత్పరత్వమతు లై నటియించిరి తన్నిశీథినిన్.

పాత్రధారిణు లలసటపడిరి; నాట
కాంత మగువఱ కేకశయ్యయు ఘటిల్లె;
కడచె నడురేయి; కన్నులఁ గప్పె సుప్తి,
ఆయహల్య తలాడపై నట్టెవాలె.

వాలినయంతలోఁ గునుకుపట్టె నహల్యకు, కోడలంత భే
దాలకునంకురార్పణ మొదందలఁపోయుచుఁ బ్రక్కఁజేరి యా
లీలలతోఁ శయించె, నది రేయెపుడో తన మామ కాంచఁగా
జాలును కూలు, నాపనియుఁజక్కఁగ దీఱునటంచు నెంచుచున్.

శాపోపహతి

కాఁగు నెడంద, మండు నెఱగన్నుల, రాతిరి నాల్గుజాలు, త
జ్జాగ్రియలోఁ బురందరునిజాడలు గానక గౌతమర్షి, యే
వో గుజగుంపు లాడుచు నిరుద్యముఁ డై తనపర్ణశాలకున్
సాగె, మహాధ్వనీనత భృశమ్ము కృశించినవాని కైవడిన్.

జాలమార్గదిదృక్షాపరిసారితేక్ష
ణుం డగుచు నేకశయ్యపైఁ బండియున్న
ఆయహల్యామహేంద్రుల నరసి నసిగ
ప్రముషితేంద్రియుఁడై స్తబ్ధభావుఁ డయ్యె.

నిలువున నీరై యెద మం
టలత్రాఁకున మండి నిలుచుటకు నేరక, యె
ట్టులొ పంచపాళిలోఁ జది
కిలఁబడి మూల్గుచు విచారఖిన్నుం డయ్యెన్.

కట్టాణిముత్యముల్ కట్టినరీతిఁ జె
మ్మటబిందువులు మేనఁ బొటమరించె
ఖండపోఁతగ మహాక్రోధమ్ము గ్రుమ్మరిం
చినరీతిఁ గనులఁ గార్చిచ్చు లుబికె
వేలాతిగావేశకోలాహలము దేహ
యష్టిఁ గంపిల్ల నాట్యమ్మొనర్చె
ఆర్ష మానధనంబు లాపోశనించిన
ట్లార్తి చిత్తమును బి ట్టావరించె

ఇంతమునియుఁ దదృశ్యసమీక్ష చేసి
పల్లటిలి దూపటిలి సన్నగిల్లి, తూలి
కటకటంబడి యేవేవో కలలు గనుచు
బోధ ముడిగి తా నొక్కయున్మాది యయ్యె.

ఏవో బాధలు జారిణీపతిసటం చేవేవో దుర్భావనల్
ఏవో నిందలు, స్వాశ్రమంబు వృథ యం చేవో విరోధోక్తు లే
వేవో తర్జనభర్జనమ్ములును బాపేచ్ఛల్ ప్రలాపమ్ములున్
లావుల్ దక్కె మహార్తిఁ జిక్కె ముని నేలంగూలి వాపోవుచున్.

ఏదారిఁబట్టి వాసవుఁ
డీదారికి వచ్చె? బుద్ధిహీనుం డై తా
గాఁదారిప్రొద్దువేళల
మాదారల భంగపఱుప మఱఁగినవాఁడే?

ఉమ్మస మింతగా బలిసె నోరిదివస్పతి; నీమనాగవా
సమ్ము శచీపతిత్వమును జాలక మా దెస మోరలెత్తె నై
జమ్మటరా? మహేంద్రితకుఁ జాలినగండఁడ; వార్షవహ్నిలో
దుమ్మగు యోగముం గనుటతోఁ దెలవాఱునో నీకదర్థముల్.

వాని నవఁ బనేమి వాచేటు, మనపసిం
డికిని జిలుము గలుఁగ; నేర మొకట
శిక్ష యొకటనా? విచిత్రి మహా వనితాత్వ
మెంతలోన మాఱె యెంత కయ్యో?

అయ్యో!. యెంతటిమోసకారివె యహల్యా! నీసతీధర్మ మే
మయ్యెన్? గౌతమధర్మపత్నివఁట గాదా! పల్కన్ నోరాడ దీ
సయ్యాటంబులు నిందుఁద్రోడసటవే? చాల్ చాలు మా కింక నీ
తియ్యం బియ్యెడ నయ్యె జాతికి మహాథిం గూర్చు ముచ్చిచ్చుగా.

ఇది నాకర్మము దాని నన్న ఫల మేమీ? దానిప్రారబ్ధ మా
విధి నీడ్చెన్, భువి నెవ్వ రెవ్వరిని దప్పింపంగలా రూరకే
పొదలంబోవు జనాపవాదములు నొప్పం దప్పులుం గూడి, క
న్నదియున్ విన్నది యొక్కఁ డయ్యె, సడి నన్నల్ సేయఁ బోకారునే?

జనతి హోమము గుఱుతించెఁ, దనకుయుక్తి
సఫల మైనందులకు లోన సంతసించె
ముఱిసె; లేచియు నాహార్యమును దొలంచి
యింటిపని తీర్చుచుండె నే మెఱుఁగనట్లు.

మెలఁకువఁ దెచ్చికొంచు మిడిమేలపుసవ్వడు లేవో వీనులన్
పోలయ నహల్య లేచి "యట మూలుగు లేమియొ పంచపాళిలోఁ
దెలియును కోడలా?" అనుచుఁ దేఁకువ మేకొనఁ దానె పోయి, యా
డ్గిలఁబడియున్న భర్తఁ గని డెందము ఆపడఁ బల్కరించుచున్.

ఏమి ట్లుంటిరి? మూల్గు లేల? కుశలంబే బిడ్డ? కో గౌతమ
స్వామీ! యెప్పుడు రాక? మీవరుస లబ్బా గుండెలం గుల్చెఁగా
దే! హోనం బిపుడా? మునీంద్ర! కొడు కేఁడీ? యెట్టులున్నాఁడు? మీ
మో మేమో కుసిలించు; పల్కరు మహాత్ముల్? మాట మాణిక్యమా?

అనుచుఁ దా నుండఁబట్టక మునిని దఱిసి
కంటిపాపలు కలిపి చేనంటి యడుగ;
కాల మెట్టిన త్రాఁచు; ముక్కంటిమంట
అగ్గిపై గుగ్గిలం బౌచు నాతఁ డనియె.

తాఁకెదవె నీముచిఁకటితప్పులెల్లఁ
గనులఁ గంటిని చెవుల వింటిని; మునీంద్ర
శబ్ద ముపమిత హోనతే చాన? కాక
తత్పురుష హోనా? పలవరింతలఁటె పవలె?

జారిణీ! జాతిగుండెలజాణ వీవు
ఎంతదుర్ణయమే? యింత కెంత నటనె?
మగనిఁ గొట్టి మోసా లెత్తు తెగువ లెల్లఁ
గొంచకే నంగనాఁచి! చూపించినావె.

ఆహా! జారిణి! జారిణీ! యను టహల్యాజాని! నన్నా? యివే
యూహాపోహము? లీను మీరలుఁగనే యుం డిట్టు లన్నారొ? మీ
వ్యాహారమ్ము లుఁదర్కముల్ భయదదావజ్వాల లై నాతనూ
దాహం బిమ్మడిచేసెడిన్ సుఖమె కాదా బిడ్డకుం జెప్ప రే?

తమవిచారమ్ము కోటిజంపములు వెట్టి
చీల్చి చెండాడు నాశుష్కచిత్తయష్టిఁ
గొడుకు సుఖ మున్నవాఁడె? వాకొన రివేటి
వక్రితలు దాఁపురించె మీవదనమందు.

ద్వాదశార్కులు విశ్వదహన మ్మొనర్పఁగా
నుదయింప రే విష్ణుపదమునందు
సప్తవాతములు కాష్ఠలఁ జుట్టిముట్టఁగా
వీఁచవే యీవిశ్వవిలయమునకు
పుష్కలావర్తకమ్ములు తాండవించుచు
ముజ్జగంబుల నీట ముంచ లేదు
ఉదయాస్తమయముల నుడువీధి నంటుచు
గతులు తప్పవు నవగ్రహములకును

ఏల మీచూపులో సెగ? లేల తీక్ష్ణ
దీర్ఘనిశ్వాసతతులు? సంధింప నేల
గన్నులఁ గవోష్ణధార? లక్కజ మిదేల
కలిగెఁ దమ కిట్టిసర్వాంగకంపనమ్మె.

ఓసి! వగలాడి! చూచుచు నుండఁగానె
కనులఁ గారము చల్లెదే కాలమేయి?
ఇంకనుం డాఁగురించెదవే కులఘ్ని!
జారకాంతలయెడఁద పాషాణమయమె.

ఓశిలామయి! కుమతి! నినోర్వ్చవాఁడ
నే? త్వదాకృతి శిల యగుఁగదే; "తథాస్తు"
ఆర్ష తేజము వాగ్వజ్ర మగుచుఁ దగులు
పదవె! నాదృష్టి తొలఁగి నిర్భాగ్యురాల!

అన్నా! మోహము, పట్టిభ్రాంతి, మునినాథా! జారిణీభావమా?
యెన్నండైనను నాయెదం దగిలెనా? యే లిట్లు శాపాగ్నిచే
నన్నున్ దగ్ధ మొనర్తు? రియ్యది దురన్యాయంబు; నిర్హేతుకో
త్పన్నక్రోధము సంహరించు మునిమూర్ధన్యా! క్షమాశాలి వై.

ముక్కు మూలము లేనిదే చిక్కు వలుప
ధర్మమే మీకు శాపమ్మె తగిలెనే మొ?
అయ్యయో కాళ్ళు తూలెను, హా! మహర్షి!
ఏను శిల నగుచుంటి దిక్కెవ్వ రింక?

శాపము సంహరించు మునిచంద్రి! శిలాత్వము తాఁకుచుండె నే
పాప మెఱుంగనయ్య! మది భ్రాంతిలితయ్య, యహల్య యెన్నఁడేన్
నీపదసేవ లేమఱి వినిందిత యయ్యె నటయ్య? శాపమున్
బాపఁగదయ్య! కర్కశతపశ్చరణా! శర ణంటిఁ గావవే!

అకట ఱాఱూపు మొలబంటి యయ్యెనయ్య!
పలుక దే యోగదృష్టి? నిప్పచ్చరంబె?
ఏను నిర్దోష, నిర్దోష, నేను నిరప
రాధనయ్యా! కటాక్షింప రాఁగదయ్య.

కదలింపంబడు నూర్ధ్వకాయము నధఃకాయంబు ఱాఱూపునన్
మొదలంజాలదు, దీనదృష్టులను గన్నీ రుబ్బ, పెం పేది బె
ట్టిద హాచున్ జడహా; మృదుత్వమును గాఠిన్యంబునుం బొందనై
బ్రిదుకుంజావు లహల్యదేహమున సంప్రాప్తించె నొక్కుమ్మడిన్.

సైంహికేయుఁడు విధుఁ బట్టి చప్పరింప
నావహించినయట్లు, ధరావలయము
మట్టుకొని మ్రింగుగాఢతమమ్ము మాడ్కి
క్రమ్మె మునిశాపశక్తి యాయమ్మ నపుడు.

ఒకకోకిలమ్మ నిట్టూర్చి కన్నె ఱచేసి
కుహుకుహుధ్వనుల వాపోనుచుఁ బర్వె
ఒకగండుతేఁటి బిట్టులికి సంచలితయై
మూఁగబాధల దీర్ఘముగను మూల్గె

ఒకలేటిపసికూన చకితయై తాపడి
బేలచూపులను బెంబేలుపోయె
ఒకజాజితీన యట్టుడికిన ట్టయి జీర్ణ
పర్ణాశ్రితిని రాల్పంగఁ దివిరె

కంటఁ దడిపెట్టుకొనె నొక్కగండశిలయుఁ
జలికిలంబడె నాసదాగతియు వగను
గౌతమమహర్షి శాపసంక్రాంతికలన
నాయహల్యను తారూప మలమినపుడు.

అంతట యోగదృష్టి హృదయమ్ము లగించుచు పహాని విన్నక
న్నంతటిలో నిజ మ్మెఱిఁగి, హా! సతి! సాధ్వి! మ దేకజీవనా!
యెంతటిమోహ మయ్యె నిను నెంతకుఁ దెచ్చితి మూఢబుద్ధినై
కాంత! గళమ్ము దాఁక శిలగా నయితే, యని కర్ణవర్తియై.

అయ్యయో! ధర్మపత్ని! జయమ్ము నీది
యపజయము నాది, నీవు ధర్మైకరతివి
ఏ నధర్మైకమతిని, సర్వేశుపాద
ధూళితో శాపమోక్షము దొఱకు నీకు.

నామనంబు కర్కశశిలాకోమలంబు
తరుణి! నీది పన్నీటిచందనపుఁగరడు
ఎంచి వరియించికొన్నార మిరువురమును
రమణి! నీకును నాకు శ్రీరామరక్ష!

అనుచుఁ బలికి తహతహన్ గుంది దిగు లంది
కరఁగి మోక్ష మిడియె గౌతముండు
అశనిపాతమునకు నమృతవృష్టికిఁ గూడ
వలఁతు లగుట పశులు వారిదములు.

విం తగుమౌనివాక్కులు చెవిం బడెనో పడ లేదో మౌనిశు
ద్ధాంతము నిల్వునం గఱఁగి యూదటఁ గన్నులనుండి జాఱె, నే
కాంతము మాఱుమ్రోఁగిన "దహల్య శిలామయి" యంచు; మౌనియున్
జెంతనె గోడచేరువుగఁ జేరగిలంబడిపోయె ఖిన్నుఁడై.

గాజుకనులబొమ్మగా మాఱిపోయిన
ధర్మపత్నిసన్నిధానమందు
పడి జడత్వ మంది ప్రతిశాపదగ్ధుని
కైవడిన్ వసించె గౌతముండు.

తెలివి నొకింతలోఁ బడసి దీనత చూపులఁ దోఁప నంగక
మ్ములు జడియంగ డేఁకి మునుముందఱిరాప్రతిమన్ స్పృశించుచున్
వలవలఁ గన్నుఁదోయి జడివానలు వెట్టు; నొసల్ ఘటించు, నిం
దలు తనుఁగూర్చి పల్కు, పరితాపపరీతవినీతమూర్తియై.

కాలు జాఱినఁ దీసికోఁగలముగాని
నోరు జాఱినఁ ద్రిప్పికో నేరు గలము ?
ఆశుగ మ్మది విడువ కున్నంతసేపె
పట్టఁ దర మే ప్రయోగింపఁబడిన వెనుక.

లోఁ గలజనతి యిదెల్లం
గ్రీఁగంటనె గనుచు వెచ్చగిల్లుచు మెల్లన్
రాఁగలుగుచు ధీరతఁ బురి
క్రోఁగలుగుచు నుండెఁ దేలుకట్టిన దొంగై.

ఆత్మబోధ మంద సరిగినయాశతా
సందుఁ డాముహూర్త మందె వచ్చి
చేసుకొనియె; విధివిచిత్రసంధానకౌ
శల మొకప్డు వింతఁ గొలుపుఁ గాదె!

నెనరున హానివర్యు లతనిన్ మునుఁగొంచును దోడి తేఁగఁ దా
మునుకొనుభక్తితత్పరసముద్యమతన్ బితృపాదవందనం
బును నెరవేర్పఁ బర్ణకుటిముంగిట నిల్చి "నమః పితృభ్య" యం
చును బడి మోకరిల్ల నటఁ జోద్యము పల్కరు నుల్కరెవ్వరున్.

తండ్రి! తండ్రీ! యటంచు నాతనయుఁ డాడె
అమ్మ! అమ్మా! యటంచు నాయయ్య పిలిచె
పలుకరే యొక్కరేని; కన్నులకు నెదుట
నిలిచియుండియు నది యేటినిబ్బరంబొ?

అమ్మా! అమ్మ! యటంచు లేచి యతఁ డత్యంతార్తుఁడై యాడ తా
బొమ్మం జేరి కరమ్ములన్నిముకుచున్ బొంతం గృశీభూతులై
సొమ్మం గుప్పెరు తాతపాదులను సంక్షుబ్ధాత్ముఁడై కాంచి, నే
త్రమ్ముల్ బిమ్మిటిపోవఁగాఁ బనవె సంతాపమ్ము రెట్టింపఁగన్.

అమ్మా! బ్రాహ్మన? అమ్మవా? పలుకవమ్మా! యీపరిణామ మే
మమ్మా? యెవ్వరికృత్యమో నుడువవమ్మా? యేల ఈరూపు, మా
యమ్మా? మూఁగనటమ్మ? తండ్రి! యిది యేమై యుండు? నీవైన నా
కిమ్మా యుత్తర; మేల మీకు శ్రమ? నేనే దీని వీక్షించెదన్.

అనుచుఁ దనదివ్యదృష్టి నందంద వఱపి
ఆగతానాగతములఁ గన్నారఁ గాంచి
మామమంత్రమ్మ, నారదమౌనియుక్తి,
జనతివైకృతియున్ ఫలించిన వటంచు.

ఓసీ! దుర్మతి! నాలిముచ్చ! యెట నోహో! నీదుపన్నాగముల్
వేసమ్ముల్ సఫలమ్ములా? జనతి! యీవే దర్శనం బోసి రా
కాసీ! అమ్మను బొట్టఁ బెట్టుకొని కుల్కంజూచితో, నిన్ను బల్
గాసిం బెట్టెద "తత్తథాస్తు" గురుధిక్కారంబు నీ కయ్యెడున్.

కొమ్మ! పుట్టింటిపక్షపాతమ్మ నెఱపి
యెంత చిత్రనాటిక నటియించినావె!
చాన! నీది రక్షఃపిశాచప్రవృత్తి
పదవె! నాదృష్టితొలఁగి నిర్భాగ్యురాల!

ప నపరాద్ధనైతి, క్షమియింపఁగరానియకృత్య మొక్క డ
జ్ఞానము పూని చేసి పరిణామము గాంచి విమూఢనైతి, నో
మౌనివరా! మనమ్మున శమమ్మునహించి సహింప వేఁడుచు
న్నా నలతల్లిదండ్రులమనఃప్రియముం బొనరింపఁ జేసితిన్.

భ్రష్టపదుఁ డౌచు నడవులంబడి దురంత
కష్టనష్టము లొందునాకన్న తండ్రి
ముదల తలఁ దాల్చి యిట్టితప్పిదము సలిపి
గడ్డి కఱచితి పూని! యాగ్రహము వలదు.

అంచుండన్ భుగభుగ పఱ
తెంచుచు మునిశాపశక్తి తేఁకువతోఁ గా
రించెన్; రక్కసి రూపు ఘ
టించెన్ జనతికి మహాపటిష్ఠత మించెన్.

కనునేత్రరేఖలందునఁ దేలుబుద్బుద
మ్ములు నాఁగ మిట్టగ్రుడ్డులు నటింప
వదనగహ్వరములో మెదలునగ్నిజ్వాల
కరణి నాలుక మహోగ్రత నటింప
మిత్తి ప్రేవులు చీల్చి మెసవుచున్నట్లు దం
ష్ట్రలు లోనిక్రౌర్యవక్రతలఁ దెలుప
జుంజురుతల రాగిజుట్టుతో నూడల
గుజ్జుమఱ్ఱివిధాన గుబురుకొనఁగ

గడ్డిబొద్దులతోడిసంగాత మొందు
కన్బొమలు, తుట్టపెదవులు, గట్టునుదురు
చేటచెవులును భీకరచిత్రలీల
జనతి మెడదాఁక రక్కసితనువు నొందె.

రక్కసిరూపమా మునివరా? వికృతాకృతి సోఁకుచుండె, నా
చక్కఁదనంపుమోమునఁ బసల్ చెడఁబాతె; మరల్చు శాపమున్ :—
టక్కులమారి నీసట లిటన్ ఘటియించి నటింపఁబోకె, పెం
పెక్కనతిండ్రి లియ్యవి సహింపఁగఁబోలవు పొమ్ము బంధకీ !

చెఱుగదు తిరుగదు శాపా
క్షరము శిలాక్షరము నిన్నుఁ గట్టి గుడిపెడిన్
యెఱిఁగి యొనర్చినదెల్లను
నెఱుఁగక యనుభావ్య మాట యెఱుఁగవె తరుణీ!

అనుచుండఁగనే యామెకుఁ
దనువెల్లను రాక్షసత్వధర్మము సోఁకన్
దనలోఁ దానే భీతిం
గొనుచుం దనతనువు తడవికొనుచుం బలికెన్.

అయ్యో! భీకరరూపుఁ దాల్చె తను వబ్బా! చూడలేనయ్య, నా
కు య్యాలింపఁగదయ్య, మోక్షమును వాకోనయ్య శాంతించి, నా
నెయ్యం బెంచఁగదయ్య ప్రియసిని కానే? మౌని! శాపాంత మీ
వయ్యా యంచుఁ బదమ్ములం బెనఁగ; గయ్యాలించి త్రోపాడుచున్.

తాఁకకే తాటకా! ముట్టకే కరాళీ!
కుమతి! మాకొంప నట్టేటఁ గూల్చినావె
నీకు శాపాంత మిడువాఁడనే పిశాచి!
ఆర్షతత్త్వము నీ కర్థమయ్యె నటవె?

అని కరాళింపఁ బాదములంటి విడక
కటకటా! సామి! యీనల్లకాటిబ్రతుకు
ఇటులె తెల్లార్పఁబోక నాహితవు కోరి
చావొ శాపాంతమో నాకొసంగుమయ్య.

కనవినలేనిబాధ తొనఁకన్ బలుకన్ యెద మెత్తనౌచు, వీ
క్షణములు చెమ్మగిల్ల ముని గద్గదభారనిరుద్ధకంఠుఁడై
యనె నిటు "లోసిరక్కసి మదంబిక కెవ్వఁడు తారకుండొ, నీ
కును నతఁడౌ విమోచకుఁడు కుందక పొమ్మొకమాట చెప్పెదన్.

ఎవనిపాత్రానుకృతి నిర్వహించి; తేవని
బ్రహ్మహత్యాదిపాతకప్రచయమెల్ల
క్షాళితము గాఁగ మలకరూశములపంట
పండునో; దేశ మది యున్కిపట్టు నీకు.

పొమ్మ పాపాత్మురాల! మాపొలము వెడలి
యని వచింపఁ ద్రపాభరావనతవదన
యై వెడలె నామె; చేఁజేత నైనదురిత
మనుభవింపక తీఱునే యజునికైన.

తల్లి జయించి గ్లేవ్యులకు దత్తము చేసినయర్వ్య డైనయా
పల్లియలన్ గ్రహించి పరిపాటిగ గౌతమశిష్యమార్గముల్
చెల్లఁగఁ జేసి, కూఁతుకథ సెప్పియు, మామకు రాజ్యమిచ్చి, యా
యల్లుఁడు శాంతుఁడై పితృహితాచరణుం డగుచుం బ్రవర్తిలెన్.

---

# శాపమోక్షము

మనసుగఁ గర్త్రభీప్సితతమమ్ముగఁ గర్మఫలాశహోమమున్
దనవిశిఖాగ్ని సల్పి, గుసుధర్మము నిర్వహణ మ్మొనర్చి యా
జనకసుతాస్వయంవరము సాఁకుగ సానుజుఁడై, గురూద్వహున్
మునుకొని రామమూర్తి యనుమోదమునం జనె దండకాటవిన్.

చనునప్పుడు వన్యము లగు
వనోకహాలతాహ్వాలెల్ల నడిగి తెలియుచున్
దనకులగురుఁడు వచింపఁగ
వినుచును వినఁదగినకథలవిధముల నెల్లన్.

మలదకరూశదేశములమార్గము వట్టిరి, తత్ప్రదేశముల్
కొలువులు బొమ్మరక్కసులకున్ గసికోఁతలు జంతుకోటికిన్
నెలవులుఁ గంటకావృతవినిందితదుష్ఫలవృక్షగుల్మినీ
వలులకు, మిత్త్రిసత్త్రికి నివాసము లౌటను నిర్జనంబులున్.

పలపల వీఁచు తెమ్మెరలు భంగురతచ్ఛలకాకపక్షముల్
జలజల రేఁప వానిఁ జెవిచక్కికి నొక్కుచు రామలక్ష్మణుల్
కలకలలాడుమోమునఁ జొకారపుఁగన్నులఁ గౌశికోత్తమున్
వలగొని 'స్వామి! యియ్యెడ జనస్థలు లిట్లుగ నున్న వేలొకో?

కాకపేయము లిటుఁ దటాకములు నదులు
పాఁడిపంటల కిచటు నిప్పచ్చరంబు
బూఁజులను గ్రుంగి యొక్కకాఁపురము లేక
కాపురము లయ్యె నివి యేమికారణమున ?

తాప స్స్నందెను వృత్రహంత యయి సుత్రాముండు మున్ బ్రహ్మహ
త్యాపాపమ్మునఁ జేసి; తద్దురిత మీస్థానంబునన్ క్షాళితం
బై పెంపొందినకారణమ్మునను రామా! యివ్వి యువ్వెత్తుగాఁ
బాపాక్రాంతము లయ్యెఁ; నేఁడొకమహాపద్భార మివ్వేళకున్.

అనుచు శతానందునిచే
జనతి వడిన శాపగాథ సనిచక్కఁగ నా
ముని వినిచి తాటకాసం
హననమునకుఁ బ్రోత్సహించె నారఘువీరున్.

గురువులయాన మీఱు టనుకోకుఁడు సందియ మయ్యె స్వామి! యే
డ్తెఱ నొకయాఁడుదానిని వధించుట మారఘువంశమంతకుం
దఱుగనిమచ్చ కాఁగలదొ? తాపసవర్య; మహాత్రపాభరం
బురవడి గుండెలో మెఱయుచున్నది యియ్యది తీవ్రశల్యమై.

చాతుర్వర్ణ్యము గావ లోకహితమున్ సాధింపఁగాఁ బూను త
ద్రీతుల్ ధర్మ్యము లెట్టివిన్, మదిని సందేహింపరా దిద్ది, నీ
చేతం దీఱగ దీని కున్న; దదె వచ్చెం దున్మ మాటాడ కి
కాతర్యం బది యేల? దాశరథి! చక్కం జేయు మీరక్కసిన్.

రారా నారఘువంశభూపతికిశోరా! రామ! రా రార, యా
తీరుల్ గాంచర, వచ్చి మీఁదఁబడె "హద్ధీ, హుం ఫటుస్వాహా" లే
లేరా యెక్కిడరా ధనుస్సు నిదె వాలెన్ మీఁద నంచుండఁగా
ఘోరాకారమహాట్టహాసభయదక్రూరప్రకారంబులన్.

బారలు చాఁచుచుఁ దాఁదెక
తేఱ్ఱ రాఘవులఁ బట్టి తినఁబూనఁగ నా
ఘోరపిశాచిని కౌశప
నారిం గారించె నొక్క-నారాచమునన్.

తగిలినరామబాణమునఁ దాటక రూపమువీడి మానికాం
తగఁ బొలుపంది యాజనతి "ధన్యతఁ గంటిని రామచంద్ర! నీ
యగణిత మైనసత్కృప దయానిధి! దాశరథీ!" యటంచు నా
మగువ తగ న్నుతించి పెరిమన్ మునిపాదములంటి మ్రొక్కె-చున్.

తెలివిఁ గాంచితి బ్రహ్మవాదీ! నమోస్తు
తెగెను నాశాప మో త్రివేదీ! నమోస్తు
అనుచు మునిఁ గొనియాడి యాజనతి వారి
సరణి వెంటాడి గౌతమాశ్రమము చేరె.

విచ్చేయు నతిథివర్గము
నచ్చపుగారవమునన్ శతానందుండున్
మెచ్చుచు గౌతమమునియును
దెచ్చిరి తమపర్ణకుటికిఁ దేఁకువ మెఱయన్.

రాముపదపద్మపావనరజ మహల్య
శాపత్రిమ సోఁక నశింపంచె రాము నపుడు
గాధితనయుండు; సత్య మకారణముగ
బంధుజను లౌదు రే కదా పరమమునులు.

తోడన ఱాతిబొమ్మకు మృదుత్వము చేకురెఁ గల్గెఁ గంపమున్
నాడులఁ జూపులున్ మొలిచె, నప్పినరీతిగ రూపురేకలున్
గూడెను, బొందె నూర్పులుఁ గోమలి యూచుఁ ద్రపాభరమ్మునన్
బోడిమితో నహల్య కచమున్ సవరించుచు నిల్చె ముంగిటన్.

అరుణకిరణసంపర్కమ్ము నంది, రేకు
రేకుచొప్పున విడినవారిజముకరణి
రామపదరజస్సక్తిచే ఱాతిబొమ్మ
నాతిగా మాఱె నెల్ల రానంద మంద.

చూచెన్ గౌతముఁ డాత్మపత్నిని ముదశ్రుల్ కన్నుల న్నిండఁగాఁ
జూచెన్ గౌశికుఁ డెంతచేసితి నటంచున్ మెచ్చుకొన్నట్లుగాఁ
జూచెన్ రాఘవుఁ డన్యదార యనుకొంచున్ భీతభీతంబుగాఁ
జూచెం గోడలునుం ద్రపాభరితచక్షుర్భుగ్నశీర్షంబుగా.

చూచెం బుత్రుఁడు భక్తిభావభరసంక్షుబ్ధాంతరంగుండుగాఁ
జూచెం బ్రేక్షకమౌనిబృందమట చమత్కార రమ్యంబుగన్
వీఁచెం జల్లఁగ మందమారుతము మన్నించెన్ వనీదేవతల్
పూఁచెం దీవ లహల్యారూపము యథాపూర్వంబుగా మాఱుటన్.

మృగతతికి గౌతమాశ్రమ
ఖగతతి కగతతికి హాని గాంతాతతికిన్
మిగిలిన భృంగలతాతతి
కగణితముగ నయ్యెఁ బో మహానంద మటన్.

ఇందుఱును నిన్ని భంగుల నీక్షసేయ
నందటిని భక్తినమ్రిత నాయహల్య
కనులఁ గప్పుచుఁ దా నమస్కారపూర్వ
కముగ నుతియించి పతిపాద కమల మంటె.

వెన్నెల సుధాంశుతోఁ గూడువిధిని, మెఱుపు
జలదమునుఁ జేరునట్లు లా జనతి స్వపతి
పదకమలమత్తభృంగియై కుదురుకొనియె
సతికిఁ బతికన్న వేఱు సద్గతియుఁ గలదె?

పూర్వజనిసంచితార్థానుభూతివలన
మసలు పూనిదంపతుల నీ మాడ్కి నుద్ధ
రించి రాఘవులను నడిపించికొనుచు
సాఁగె మిథిలకు కౌశికసంయమియును.

కల్యాణమూర్తులగు నీ
కల్యాణాత్మకుల కెల్లకాలమును జగ
త్కల్యాణకరుఁడు శాశ్వత
కల్యాణుఁ డొసంగు నిత్యకల్యాణములన్.

*